'అనాథలకు, ఆగర్భ శ్రీమంతులకు మధ్య అనాదిగా సాగుతోంది సంగ్రామం' (దాశరథి)
వర్తమాన తెలంగాణ ఉద్యమం కూడా ఇందుకు మినహాయింపుకాదు
ఈ తండ్లాటలో అట్లా నిలబడ్డోళ్లకు ...

# మొగులైంది

ఇక యుద్ధమే మిగిలింది
డిసెంబర్ ముప్పయి ఒకటి
తెలంగాణ ప్రకటించకపోతే ...
యుద్ధమంటే ...
చావడమో ... చంపడమో కాదు ...
గెల్వటమో ... ఓడటమో కాదు ...
యుద్ధమంటే ...
పొద్దు గూంకడం ...
మళ్ళీ తెలంగాణా రాష్ట్రంలో తెల్లారడం ...
యుద్ధానికి కావాల్సింది
చేతిలో ఆయుధం కాదు
గుండెలో ధమ్ము

– వేనేపల్లి పాండురంగారావు



# తెలంగాణ కవిత

2009

సంపాదకులు

సుంకర రమేశ్

**మట్టి ముద్రణలు**

ఆలగడప, మిర్యాలగూడ,
నల్లగొండ, తెలంగాణ- 508 207.



# అంతిమ వాక్యం సాక్షిగా ...

వాళ్ళు మా ఎముకలు విరగ్గొట్టొచ్చు
మా స్వప్నాలను చిదుమాలనుకోవచ్చు
కానీ మా ఆత్మలను
తాకలేరు

వాళ్ళకు మా రహస్యాలు తెలియవు (వెయిటింగ్ ఫర్ మిడ్‌నైట్ అవర్ - హాయవమ్ నాయర్ - పాలస్తీనా కవి - అనువాదం సుంకర రమేశ్)

తెలంగాణ పోరుబిడ్డలను ఏ లాఠీలు ఆపలేవు. ఎన్ని నిర్బంధాలు విధించినా మా మాట, మా పాట తెలంగాణే అంటూ ముందుకు సాగుతున్నరు.

సుదీర్ఘ అవమానాలను, సాంస్కృతిక పీడనలను పిడికిలి బిగించి నిల దీస్తున్నరు.

పొట్టమీద కొడ్తిరి
మిమ్మల్ని ఏమంటిమి?
కడుపులో పెట్టుకొంటిమి
నీళ్ళకుండను మలుపుకు పోతిరి
ఏమంటిమి?
చూస్తూ ఉండిపోతిమి
బిడ్డల కొలువుల్ని తన్నుకు పోతిరి
ఏమంటిమి?
దక్కని వాటికి దిక్కులు చూస్తిమి
నిలువనీడను గుంజుకొంటిరి

ఏమంటిమి?
మాలో మేము నిందించుకొంటిమి
ఎవుసం తెలియదంటిరి
ఏమంటిమి?
అగ్గువకు అమ్ముకొంటిమి
సదువురాదంటిరి
ఏమంటిమి?
వచ్చిన కొలువు చేస్తిమి
భాష తెలియదంటిరి
యాస ఎగతాలి జేస్తిరి
గుండెమీద తన్నితిరిగదరా
ఇగ మా వశం కాదురా ... – సుంకర రమేశ్

ఊళ్ళకు ఊళ్ళు కదలినయి, రోడ్లకు రోడ్లు కూడబలుక్కున్నయ్. ఆకాశంలోకి పక్షులు లేచినయ్. ఒకటే మాట, ఒకటే పాట నరనరాల్లో పొంగి పొర్లింది. తెలంగాణ మట్టిబిడ్డలు పిడికిలి బిగించి కసికసిగా దశాబ్దాల అవమానాల సంకెళ్లను బదాబదలు చేసింద్రు.

రాత్రీపగలు తేడాలేదు. ఉభయ సంధ్యల్లోనూ తల్లి తెలంగాణను కళ్ల కద్దుకున్నరు. యూనివర్సిటీలన్నీ జై తెలంగాణతో పులకించిపోయాయి.

ఒక ప్రకటన తెలంగాణ ఇచ్చినట్టే నమ్మించింది. ప్రతి గుండెలో తెలంగాణ జెండా రెపరెపలాడింది. ఒక ప్రకటన గుండెల్ని చిదిమేసింది. నోటికాడి బువ్వను గుంజుకున్నది.

ఉద్యమాల జ్వాల ఎగిసిపడింది.

"జనం పదునెక్కారు
నీ విద్రోహాన్ని నిలువునా కోస్తారు
జనం పోరాటం చవిచూచారు
నీ బూటకత్వాన్ని లోతుగా తవ్వితీస్తారు"



నువ్వేమాలోచిస్తావు అనేది నువ్వెట్లా మనుగడ సాగించేది నిర్ణయించదు. నువ్వెట్లా మనుగడ సాగిస్తావో అది నీ ఆలోచనలను నిర్ణయిస్తుంది.

దోపిడీకి, పీడనకు గురయ్యేవాళ్ళు ఒకరకంగా ఆలోచిస్తే, దోపిడీకి అలవాటు పడ్డవారు ఇదే వ్యవస్థ కొనసాగాలని కోరుకుంటారు.

డిసెంబర్ 9 తరువాత కోస్తాంధ్రలో వచ్చిన బూటక సమైక్యాంధ్ర ఉద్యమం ఈ కోవలోనిదే. తెలంగాణ ప్రక్రియ మొదలు బెడ్తరని చెప్పగానే వాళ్ళకు కాళ్ళకింది భూమి కంపించిపోయింది. వొళ్ళంతా చల్లబడింది. డబ్బు సంచులతో కృత్రిమ ఉద్యమాన్ని తెరమీదికి తెచ్చింద్రు. యువకుల్ని రెచ్చగొట్టి మసిపూసి మారేడుకాయ జేసింద్రు.

ఉత్పత్తి సాధనాలన్నీ ఒకే ప్రాంతం వారిదగ్గర ప్రోగుపడి వుంటే మరో ప్రాంతం వారికి రెండు రెక్కలు మినహా మరే సాధనా సంపత్తి లేనప్పుడూ – ఆ రెండు ప్రాంతాల ప్రజలు కలిసి వుండే అవకాశం ఎంతమాత్రమూ వుండబోదు.

ఒక నవలోకం కోసం ఎనలేని ఆరాటంతో, ఉత్కంఠతతో రంగంలోకి తెలంగాణ నినాదంతో ఉరికిన యువతరం ఒకవైపు, కడుపులో కక్ష దాచుకున్న ఆంధ్ర పెట్టుబడిదారుల కిరాయి మద్దతుదారులు మరొకవైపు మోహరించారు.

సత్యానికి, అసత్యానికి మధ్య పోరాటం మొదలైంది. డబ్బు సంచుల గలగలలకు, తెలంగాణ బిడ్డల కడుపుకోతకు పోరు మొదలైంది. "ముందు పెద్ద పులితల, వెనుక పాము తోకలాంటి రాజకీయ స్వార్థపరుల చేతిలో తెలంగాణ బలైపోయింది.

తెలంగాణ బిడ్డల ఆత్మ బలిదానాల సాక్షిగా 2009 నిలబడ్డది. పోరుగడ్డ బిడ్డలు ఇట్లా ఉరితాళ్ళను బిగించుకుని, పెట్రోలు చల్లుకొని తెలంగాణ కోసం ఉరుకుతున్న రైలు నుండి జై తెలంగాణ అంటూ దూకేయడం, ప్రాణాలను గడ్డిపోచను చేసిన తీరుకు తెలంగాణ ప్రజలంతా గుండెల్ని పిండుకున్నరు.

ఎన్ని తీర్లా రాకపోయేసరికి తమను తాము అంతం చేసుకొని తమ నిరసనను మృత్యు గీతంగా పేర్చారు. ఈ బిడ్డలు ఈ గడ్డ నుండి వెళ్ళినా మన కనుపాపల్లో తెలంగాణ జెండా ఊపుతూ నిత్యం కదలాడుతుంటారు, మన మరణాల దాకా. ఆ చావు పాట వినిపిస్తూ ఎప్పుడో అప్పుడూ, మన ఆనంద–విషాద సమయాల్లోను, మనం నోట్లో ముద్ద పెట్టుకుంటున్నప్పుడో, మన పాపల కేరింతల్లోనో మన మనసుల్ని పిండి చేస్తుంది.

పెండ్లీడుకొచ్చిన నిండు యౌవన జలపాతాలు, భార్యా బిడ్డలతో సాగుతున్న నౌకలు ఒక్కసారిగా ఆగిపోయాయి. కాలం గుండెపై గాట్లు పెట్టి చరిత్రలో మరొక్కసారి మనిషి తన స్వాతంత్ర్యం కోసం, వివక్షను ఖండిస్తూ, స్వాభిమానం కోసం, తన ప్రజల కోసం ఎంతటి త్యాగానికైనా వెనుదీయడని ఋజువైంది. బిడ్డల తల్లులారా, మీ బిడ్డల కడసారి పలుకులు ... మీ గుండె లయను శృతి మార్చవచ్చుగాక. మీ కండ్ల నీరు ఎండిపోవచ్చుగాక. కానీ అంతిమ వాక్యం సాక్షిగా వారు కా'రణ' జన్ములు.

నా కలల్ని
ఏ అడ్డంకులు చెరపలేవు
నా నమ్మకాన్ని
ఏదీ అధైర్య పర్చలేదు
నేను మళ్ళీ వస్తున్నాను
ఒక పీడకల
నేనొక విషపు తోటలోకి
వెళ్ళాను
నా చుట్టూరా నిలువెత్తు
గోడలు

నేను మోసగాళ్ల
వాసన పసిగట్టాను
వాళ్ళొక మనసులేనోళ్ళు
వాళ్ళదొకటే భాష
మోసమే వారి భాష
వాళ్ళకీ పవిత్ర తెలంగాణను
కించపర్చడమే తెలుసు
నా అస్తిత్వాన్ని రూపుమాపాలనుకునే
వారిని నేనే రూపుమాపుతా ...



నా తలపై గాయాల కుట్లు మాయమైనవి
కాలిన మచ్చలు ఉపశమించాయి
నా కళ్ళు ఇప్పుడు నిశిత నేత్రాలు
నేనిపుడు నివురుగప్పిన నిప్పును

రోడ్లిప్పుడు నా వాళ్ళ అదృశ్య సుప్తాస్థికలు
నా ప్రతి కణంలోకి ప్రవేశిస్తున్నాయి (పాలస్తీనా కవిత - అనువాదం : సుంకర రమేశ్ )

• • •

ఆమె కనులు
తెలంగాణ
ఆమె తెలంగాణ
ఆమె తెలంగాణా జెండా
కప్పుకున్నది
ఆమె దుఃఖం తెలంగాణ
ఆమె దేహం తెలంగాణ
ఆమె చరణం తెలంగాణ
ఆమె పదాలు తెలంగాణ
ఆమె జననం తెలంగాణ
ఆమె మరణం తెలంగాణ - సుర

చనిపోయిన వాళ్ళు ఏం చేసినా చేయకపోయినా నిజం చెప్పగలరు. ఒక సత్యాన్ని ఒక ప్రగాఢమైన వాంఛను తెలంగాణ పట్ల వారి ప్రేమను ప్రపంచానికి వెల్లడించారు. తెలంగాణ స్వప్నం రెక్క విప్పడానికి ఇంకా ఎంతో కాలం పట్టదు.

నిద్ర గన్నేరు చెట్టు మేల్కొన్నది ...

తెలంగాణ ఉద్యమ సాహిత్యంలో భాగంగా తెలంగాణ కవిత ధారావాహికగా వస్తున్న విషయం పాఠకులకు తెలిసిందే. ప్రపంచ సాహిత్య

చరిత్రలోనే ఒక ప్రజా ఉద్యమాన్ని కవిత్వం చేస్తూ తెలంగాణ అస్తిత్వ కవితా సంకలనాలు ఒక చారిత్రాత్మకమైన భూమికను పోషిస్తున్నాయి. 2009 తెలంగాణ కవితా సంకలనం "శతపత్ర పుష్పపు వాలిన రేకుల్లా" గుండెలో విషాదాన్ని దిగమింగుకుని అక్షరాల కన్నీటి బొట్లను రాల్చింది. తెలంగాణ యువకుల ఆత్మ బలిదానాలు కవులను కలవరపరిచాయి.

"ఉబుకుతున్న నెత్తుటి ఊటబాయి

నా తెలంగాణ

... ... ... ... ...

నా పోరాటం బతికితే నేను బతికినట్లే కదా (రూప్‌కుమార్ - అస్తిత్వచేతనం)

కవి నాళేశ్వరం శంకరం పోరాటాన్ని జీవన్మరణ సమస్యగా భావిస్తున్నాడు.

అమరత్వాన్ని కవి నిర్వచిస్తూ ...

"అమరుడు మనిషిని నడిపించే

ఆయుధం లాంటివాడే" (నాళేశ్వరం శంకరం - అమరుని నిర్వచనం)

"దళారులకు ఆత్మలుంటేకదా!

ఉద్యమబాలుని ఆత్మహననం అర్థమయ్యేది"

మనిషి ఆత్మ గౌరవం దెబ్బతింటే అగ్నిశిఖ ఎట్లా అవుతాడో తెలియంది కాదు.

"పరాయి కౌగిట బందీయైన విషాద చరిత్ర

కృష్ణ గోదారుల తల్లి రొమ్ములు

రక్తపింజరలు గ్రోలుతున్న బాధా సందర్భం" (బూర్ల వెంకటేశ్వర్లు - ఆత్మగౌరవ కిరీటం)

తెలంగాణ బిడ్డలు చెట్ల నుంచి తెగిపడుతున్న పిందెల్లా రాలుతుంటే, పజ్జొన్నకంకుల్లా నేలరాలుతుంటే, ఎదిగివచ్చిన వరిచేను నేలరాలినట్టే రాలి పోతున్న వర్తమాన విషాదం మనసున్న గుండెల్ని పిండి చేస్తుంది.



"సుమం రాలింది

సౌరభం గాయపడింది

వెన్నెల మరణించింది

చల్లదనం నిప్పుల ఉప్పెనగా మారింది" (వంశీకృష్ణ - ఇది ఒక కామా)

"మరణానికి దేహాన్ని ఇచ్చిన అతడు

ఆత్మహత్యకి అర్థమేమిటంటే

నిరసనకి ప్రతిరూపం అన్నాడు"

ఉద్యమాలు రాజకీయాలకంటే భిన్నమైనవి. ప్రజలు ఉవ్వెత్తున్న ఎగసిపడే కెరటాల్లా ఉద్యమంలో మమేకమైపోతారు.

"ఊపిరిని మట్టిలో నాటితే"

పోరాట వృక్షం మొలుచుకొస్తుంది" (ఎన్. గోపి - ఉద్యమం వర్సెస్ రాజకీయం)

ఉద్యమం పిడికిలి

రాజకీయం అలికిడి

ప్రపంచ రాజకీయాలను ప్రభావితం చేసిన అనేక ఉద్యమాల్లో విద్యార్థులు పోషించిన క్రియాశీల భూమిక మరువరానిది. తెలంగాణ పోరాటంలో అగ్రభాగాన ఉద్యమానికి చోదకశక్తులై నిలబడ్డ ఉస్మానియా విద్యార్థుల పోరాటం, వాక్పటిమ, అద్భుత క్రియాశీలతను ప్రపంచం చూసి ఆశ్చర్యపడింది. సద్దుమణిగి పోయినాయి అనుకున్న సెగలను ప్రజ్వరిల్ల చేసింద్రు.

"రాత్రుల్లో రవిని

నిద్రలేపిన మందార దోసిళ్ళ ఉస్మానియా

నేలరాలిన

కన్నీటి బొట్టు ఉస్మానియా

శీతవేళ

పురివిప్పిన ఉద్యమ నెగడు ఉస్మానియా" (సుంకర రమేశ్ – ఉస్మానియా జామై ఉస్మానియా)

చదువుల ఖిల్లా పిడికిలెత్తిన పాట ఉస్మానియా జామై ఉస్మానియా.

మరణం అనేది సహజమే ఐతే చెట్టు నుండి పండు రాలినట్టు. మనిషి తన మరణాన్ని తానే నిర్ణయించుకుంటే కారణాలు బలమైనవి. తన అంతిమ వాక్యాన్ని తానే రాసుకోవడం ఎంత కష్టం ... ఎంత కష్టం ...

"అలసట మరణంగా పరిణమించడం కన్నా
మహా విషాదమేముంది" (దర్భశయనం-ఒక అంతిమవాక్యం సాక్షిగా...)

రాజకీయ కవిత్వం రాయడం కష్టం, రాసి మెప్పించడమూ ఇంకా కష్టం.

"భాష నెక్కిరించి
యాస నెక్కిరించి
నీళ్ళుదోచి
నిధులు దోచి
మీ వాళ్ళు
మా ఆశల బుగ్గిపాలు చేసి
మా అస్తిత్వాన్ని ప్రశ్నార్థకం చేసినప్పుడు" (కాసుల లింగారెడ్డి – కవిత్వ న్యాయం) సూటిగా ప్రశ్నిస్తున్నాడు కవి.

మరణ రహస్యపు మూట విప్పుతున్నాడు కవి ...

"బతుకు పొక వాంఛ చావులానే
చావు పొక గడ్డిపోచ బతుకులానే" (అఫ్సర్ – కొన్ని నిమిషాలు)

తాత నుండి మనువడి దాకా సాగుతున్న గాథను చిత్రికపడుతున్నాడు కవి.

"తాత నుండి మనవడి వరకు గాయాల కథను
దేశం నుండి సెజ్‌దాకా కాలిన ఎదను" (బెల్లియాదయ్య – గాయం)

తెలంగాణకు మకుటాయమానమైన హైదరాబాద్‌ను తన అక్షరాలతో చెక్కుతున్నాడు కవి తనివితీరా ...

"షెమ్మా వెలుగుతోంది



నేను కరుగుతున్నాను
పరదాను పక్కకు లాగకండి" (రాజా హైదరాబాదీ – గూంగా షాయర్)

దోపిడీ రూపాలను కళ్ళకు కట్టినట్టు వివరిస్తున్నాడు కవి ...

"పరాయి ఇంటిని దోచుకునే మర్మం
మా తడి హృదయాలకు తట్టలే" (హనీఫ్ – జల(గ)గానం)

ఆర్టీసియన్ అనుభవాన్ని శిల్పీకరిస్తున్నాడు కవి. తన కళాపారసత్వపు గరిమను గురిపెడ్తున్న బాణం ఈ కవిత.

"రాత ప్రతులకు అగ్ని అంటించారు
నా యవనికల్ని చింపి పారేశారు"

"సృజనలో ఉన్నాను ...
సృజననై ఉన్నాను ...
సృజనతో ఉన్నా"నని కవి ఎలుగెత్తి చాటుతున్నాడు. (శ్రీనివాస్ దెంచనాల – జీవ వాంగ్మూలం)

తమ బ్రతుకుల్ని బంతిపూల్లాగా తెంపి తెలంగాణ తల్లికి హారమైతున్నరు అంటున్నాడు కవి.

"చావును చచ్చిపో అంటున్నరు
మాకు తెలంగాణ ఇచ్చిపో అంటున్నరు
కళకళలాడాల్సిన పిల్లలు
కలత చెందుతున్నరు
కలలు చెదిరి" (సీతారాం – తెగిన బంతిపూల దండ)

తెలంగాణలో హిందూ-ముస్లింలు రెండు వర్గాలు మతాతీతంగా అలాయి బలాయ్ అందుకోవడం కనిపిస్తుంది. నల్లగొండ జిల్లాలోని జాన్‌పహాడ్ దర్గా ఇందుకు చక్కని ప్రతీక. అనేక మంది ప్రజలు జాన్‌పాడ్ సైదులు పేరు పెట్టుకోవడం ఈ జిల్లాలోని వారికి సుపరిచితం.

దర్గాలోని సమాధులను వర్ణిస్తూ ...

"తెల్లని గుర్రాలు తీరిగ్గా గడ్డిమేస్తున్నట్లు
గతాన్ని నెమరువేసుకుంటున్నట్లు వరసగా సమాధులు"

సమాధుల్ని తెల్లని గుర్రాలతో పోల్చడం అచేతనమైన వాటిలో కూడా

ప్రాణ చైతన్యాన్ని ఉపమానం చేయడంలో కవి అద్భుతమైన ప్రతిభావ్యుత్పత్తులకు పాఠకులు సలామ్ చెపుతారు.

"మతాతీతం పంచే దర్గా
నెలవంకై నేదతీర్చే విసర్గ" (యాకూబ్ - దర్గాదయ)

తెలంగాణ ప్రజలు నిరంతరం ధోకాకు గురవుతున్న తీరును కవిత్వం చేశాడు.

"దీపాలు ఆర్పేటోల్లు
వచ్చింద్రు వచ్చింద్రు
ఊసరవెల్లి రూపాలు మార్చేటోల్లు
వస్తుంద్రు వస్తుంద్రు ..."
అంటూ గట్టిగా నిలదీస్తుండు కవి.

వచ్చింద్రు వచ్చింద్రు అని ఒకసారి, వస్తుంద్రు వస్తుంద్రు అని మరొకసారి మాటలను ఉపయోగిస్తూ కవితకు ఒక లయను సాధించాడు కవి. జూకంటికి భాషను ప్రయోగించే నేర్పు బాగా తెలుసు. ఎంచుకున్న వస్తువును ఎలా నడపాలో, ఒక ఊపును ఎట్లా సాధించాలో తెలుసు. వచన కవితకు కూడా నడకలో వేగాన్ని తీసుకవచ్చిన కవుల్లో అరుదైన కవిగా చెప్పవచ్చు. ఎన్ని కవితలు రాసినా అదే ముద్రను కొనసాగించడం, కవితా నిర్మాణం పట్ల ఈ కవికి ఉన్న అమిత శ్రద్ధాసక్తులను తెలియజేస్తుంది. అట్లాగే తెలంగాణ పదాలను అత్యంత శక్తివంతంగా వాడుకున్న మరొక్క కవి కనిపించడు, కవితా సౌందర్యాన్ని భంగపర్చకుండా!

ఈ సంకలనంలో అద్భుతమైన కవితను మనం చదువుకుంటాము. తనదైన తాత్వికకోణంలో కవిత్వం రాసే అయిల సైదాచారి - నిరింద్రియం" లో

"దేహంలో అంతమైన జ్ఞానం
దేహంతో మొదలౌతుంది"

తెలంగాణ నేలపై పుట్టి తమ రక్తంలో, తమ హృదయంలో తెలంగాణను భాగం చేసుకున్న కవుల్లో షాజహానా ఒకరు.

"నేను వేరు నా నేల వేరుకాదిపుడు
నా తల్లిదండ్రి నీరునిప్పు ఆఖరికి
నేను కూడా వేరుకాదు - నా ప్రాంతమే



నువ్వు నా దేహంలో భాగమయితే కనిపక్కన పెట్టేదాన్ని" (షాజహానా - నువ్విప్పుడు నా భూమివి) కవయిత్రి బలమైన వాంఛను వ్యక్తీకరించింది.

ఒకానొక ఉద్విగ్న వాతావరణంలో కలతపడ్డ కవిహృదయం తను అనుభవిస్తున్న దానిని తాను చూస్తున్న ప్రతి వస్తువులోనూ దర్శిస్తుంది.

"నాకు పొద్దునే లేచి
సూర్యున్ని చూడడమైనా
అమరుడైన
వీరున్ని చూడడమైనా ఒకటే (కందుకూరి దుర్గాప్రసాద్ - బహుచేతనం)
అలతి అలతి పదాలను కడునేర్పుగా పలికించే కవి సిద్ధార్థ.

'రైలు గంట మోగినప్పుడైనా
నువ్వు ఆగమాగంగా వస్తావని చూసాను
ప్రాంతమంతా నెత్తుటిలో ... దూలాడినప్పుడైనా
మాట ఇస్తావని నమ్మాను" (సిద్ధార్థ - బుగులు)

యాభయ్యేళ్ల సుదీర్ఘ యాతనను కవిత్వీకరిస్తున్నాడు ఎలనాగ.

"పచ్చని కల పరితాపపు చిచ్చులో దగ్ధమవ్వక ముందే
తోట పూర్తిగా మాడి పాట రాలిపోకముందే
రెండు వసంత కావ్యాశ్వాసాలుగా
పరిచ్ఛేద మొందటమే పరమోత్తమం కదా!" (ఎలనాగ - యాభై యేళ్ల యాతన)

తెలంగాణ పిల్లల బలిదానాలకు కవి కన్నీటితో దీపాలను పెడుతున్నాడు. "కన్నప్పల్లా మా పిల్లలు కండ్లు పెరుక్కుంటున్నారు" (సుంకిరెడ్డి- వాళ్ళు మేము)

కృష్ణవేణిని తెలంగాణ ప్రజల ఆవేదనను ఆర్తితో వినమంటున్నాడు.

కవి వఝుల శివకుమార్ విద్రోహాల అంచులను చూపిస్తున్నాడు. పోరాటంలో శత్రువుకు లాభం చేకూరకూడదని గట్టిగా హెచ్చరిస్తున్నాడు.

"ఓ మాటగాడా!

ఓ పాటగాడా!

ఓ ఆటగాడా!

ఒక రాగంలో భాగం కావాలి అంటున్నడు. (వఝుల శివకుమార్ – విద్రోహాల అంచు మీద)

తెలంగాణ కోసం ఆత్మబలిదానాలు చేసుకుంటున్న యువకిశోరాలను చూసి గద్దర్ చలించి పోతున్నాడు. సమస్త ప్రకృతిని ఆవాహం చేశాడు.

"మీ చావు వార్త విన్న కోడిపుంజులు

కాళ్ళకు కత్తులు కట్టుకొని దుంకినయి

మీ అరుపులు విన్న మా ల్యాగదూడలు

కొమ్ములు అదిలించి కోడెలై లేసినయి

పాలు తాపిన పిల్లి, పెంచుకున్నా కుక్క

మీ పోరు దారుల్లో పరుగులు దీసినయి" (గద్దర్ – విద్యార్థి వీరులకు జోహార్లు) తెలంగాణ పోరుబిడ్డల నైతిక ధృతికి గద్దర్ నీరాజనాలు అర్పించాడు.

తెలంగాణలోని కొందరు స్వార్థపరులు ఇంకా సీమాంధ్ర పెట్టుబడిదారుల అడుగులకు మడుగులొత్తుతున్నరు. "కొసల దగ్గర సన్నం, మధ్యన వెదల్పు" అన్నట్టు వీరింకా వారి చూరునే పట్టుకుని వేళ్ళాడుతుండ్రు. పోరుబిడ్డలు బలిదానాలు చేస్తుంటె సీట్లను పట్టుకుని దిగిరావటం లేదు.

"పోరు బిడ్డలు చనిపోతూ

తెలంగాణను వాగ్దానం చేసిండ్రు"

నిద్ర గన్నేరు చెట్టు మేల్కొన్నది ఇగ ఎవరూ ఎదురు నిలువలేరు.

నీకోసం అర్పిస్తాం

ప్రతిక్షణం చెప్తున్నది



మాలో ఒక్కరి మరణం

నీకోసం గొంతెత్తి నినదిస్తాం

తెలంగాణను ప్రతిరోజు

మేము నిర్మిస్తాం

చివరి వాక్యాలు దూరమే

ఎప్పుడూ ముగింపుకాదు

నేటి నవశిశువు

రేపటి తెలంగాణ పిలుపు

వాళ్ళు మా ఎముకలు విరగ్గొట్టొచ్చు

మా స్వప్నాలను చిదుమాలనుకోవచ్చు

కానీ మా ఆత్మలను

తాకలేరు

వాళ్ళకు మా రహస్యాలు తెలియవు

మేము మా ప్రజల కోసం

జీవిస్తాము

మేమంతా ఒక్కటే

మేమంతా మా తెలంగాణను

నిర్మిస్తాము

చీకటి రాత్రిలో

ఓ నూతన కాంతి రేఖ ప్రవేశిస్తుంది.

ఆశీర్వదించండి

ప్రతి పోరు బిడ్డను

ప్రతి యోధుడిని
నీకోసం అర్పిస్తాం
ప్రతి క్షణం చెప్తున్నది
మాలో ఒక్కరి మరణం

నీకోసం గొంతెత్తి నినదిస్తాం
తెలంగాణను ప్రతిరోజూ
మేము నిర్మిస్తాం

ఆశీర్వదించండి
ప్రతి పోరు బిడ్డను
ప్రతి యోధుడిని

వర్తమాన తెలంగాణ ఉద్యమంలో మరొక విశిష్టత మానవ సంబంధాలలో నూతన పోకడలను ప్రస్ఫుటింపజేసింది. అల్ప సంఖ్యాక కులాల నుండి అధిక జనాభా కలగిన కులాల వరకు రెక్కల్ని నమ్ముకున్న కులాల నుండి బలిసిన కులాల వరకు, అన్ని సామాజిక శక్తులు తెలంగాణ కోసం గొంతెత్తాయి. ఈ రోజు ప్రతి తెలంగాణ బిడ్డ జరిగిన అన్యాయాన్ని తీరొక్క విధంగా పూసగుచ్చినట్టు చెబుతుంటే ప్రజల్లో వచ్చిన అవగాహనశక్తి, విశ్లేషణా పటిమకు సంభ్రమాశ్చర్యాలకు లోనవుతాము. ఇది మున్ముందుకీ పరివర్తన దశ.

- సుంకర రమేశ్



# అ ఆ ఇ ఈ ఉ ఊ ...

పేజీ నెం.

**అనుబంధం : సమీక్షలు**

అ

# అక్షరం కాలుతున్న వాసన

పసునూరి రవీందర్

దేహం కుళ్ళిపోయిన చోట
మనసు మసిమారిపోతుంది
సెలయేరును గుప్పిట్లో
బంధించాలనుకునే కంటే
అమాయకత్వం ఇంకేముంటుంది

అక్షరాలు ప్రజాయుద్ధ ఆయుధాలు
అక్షరాలు ఉద్యమాల జవజీవాలు
అక్షరాలు ఒక పొద్దుకాసిన
కిరణకుసుమాలు

అక్షరాల మీద ఉమ్మేయాలనుకున్నోడికి
అక్షరాలను అమ్ముకుని బతకాలనుకున్నోడికి
చరిత్ర ఏ పేజిని దక్కనివ్వదు

అక్షరం పాలబువ్వ
అక్షరం మేలుకొలిపే డప్పుదరువు
అక్షరమే బతుకును నడిపించే దారిదీపం

అక్షరాల గొడుగు కింద నడవడమంటే
మల్లెపువ్వు స్వచ్ఛ పరిమళాన్ని
గుండెలనిండా నింపుకోవడం
అక్షరాలను మోసుకు తిరగడమంటే
మట్టిని పిడికిట పట్టి వదలకపోవడమే!

సమూహాల కోసం బతికేవాడికి
అక్షరం అమ్మతో సమానం
ఆయుధంతో సమానం

ఎండిన చేల మీద
దుఃఖ గీతం రాయడానికి
అలంకారాలు కాదు
కన్నీటి చెమ్మతడి కావాలి

వలసెల్లుతున్న ప్రపంచం మీద
నాలుగు అక్షరాలను కురిపించడానికి
లోకం మీద సొరెడు ప్రేమ ఉంటే చాలు



బతుకును చదువుకున్నోడికి
బాధ్యతను తలకెత్తుకున్నోడికి
ప్రతీకలు, భావ చిత్రాలు
వెంటపడి నడిచే వేళ
అక్షరం గేట్లు తెరిచిన
కాలువల ప్రవాహ గానం

అక్షరాన్ని ఛాందస సంకెళ్ళ నడుమ
బంధించాలనుకుంటే
అక్షరం అగ్నిపర్వతమై పేలుతుంది
నలుగురు నడిచిపోతున్న దారిలో
వెలుగును తిట్టుకుంటూ కూర్చోవడం
శత్రు సమూహాల కోవర్టిజమే!

కరచాలనం కాలేనోడికి
అడుగుల కదలికలో కలవలేనోడికి
అక్షరమంటే అందమైన ప్రతీక మాత్రమే

గాయాలు వాడి గేయాల కింద
మరింత గాయపడుతుంటయి
దగాపడ్డ బతుకుల జాడలు
మోసపోయిన ఆనవాళ్ళుగా
మిగులుతుంటాయి

కన్నీళ్ళు వాడి ప్రయోజనాల
దుప్పటి కింద
ఆవిరి తప్ప మరేమి కాలేవు

తెలంగాణ మట్టిని చీల్చుకు పుడుతున్న
ప్రతీ అక్షరం
ఒక వజ్రమని తెలుసుకోలేని వాడి అంధత్వం
కాలం నుదుటి మీద ఒక మాయని మరకై మిగులుతుంది
అక్షరమే వాడి అంతిమ యాత్రను నిశ్చయిస్తుంది!







# అస్తిత్వ చేతనం

రూప్‌కుమార్ డబ్బీకార్

ఒక సాలీడును కలగంటాను
ఎడారి కుప్పల్లో నీటి తెప్పలను కలగంటాను
కలల నెవ్వరాపగలరు
విషాద సముద్రపు అలల నెవ్వరడ్డగలరు
అమాయక దేహాలపై అగ్నిపర్వతాలు బద్దలవుతుంటే
లావా ప్రవాహాలనెవ్వరు నిలుపగలరు
ఉద్యమాల జ్వాల నా తెలంగాణ
ఉబుకుతున్న నెత్తుటి ఊటబాయి
నా తెలంగాణ

ఆకాంక్షలు పురుటి నొప్పులుగా
మూడున్నర కోట్ల అలలు ఎగిసిపడుతుంటే
నెత్తుటి సంద్రాన పడవ ప్రయాణం నా పోరాటం!
నా పోరాటం బతికితే నేను బతికినట్లే కదా!!



# అర్హత

చైతన్య ప్రకాశ్

నేనేమంటి నేనేం పాపంజేత్తి
నాకు నీకూ పోలికేడిది పోటేంటిది
సీసవక్కలేరితివా ఐస్‌క్రీట్లమ్మితివా
పాక్కుల పొంటి బటానిలమ్మితివా
ఊరవతల నా పొంటి గుడిసేసుకుంటివా
ఎండ్రికాయలు, శాపలు, బుడుబుంగలు పడ్తివా,
ముంగీసలు, ఎలుకలు దింటివా
నీ బల్లెకత్తిమా? గుల్బెకత్తిమా?
నీకు నాకూ పోటేంది దొరా? సోపతేంది పటేలా
ఎవ్వన్నో మరిచి నన్ను తిట్టుడేంది పటేలా?
సొపలల్లితివా సారద కథలు చెప్తివా
సలి బువ్వడుక్కుంటివా
సిగ్గిన పేల్కలు దొడుక్కుంటివా
పదవంటిమా? పదెకరాల పొలం మలుపు కొంటిమా?
నీ అంటేంది? సొంటేంది?
నా జోలేసుకుంటివా? నీ జోలికొస్తిమా?
ఇంకెందుకు దొరా?
ఒచ్చోరకున్నోళ్ళ బజార్లేసి పజీత దీసుడు
ఇగ ఎప్పుడైనా మాట్లాడెటప్పుడు
పదవి పొందినట్టు పైసలు సంపాంచినట్టు





పెద్ద కులంల పుట్టినట్టు
మూతినాకుడు ముచ్చట్లు పెట్టినట్టు
మాయజేసి ఓట్లు గుంజుకున్నట్టు కాదు
రోకలి బండలు మోసి
ఇనుప రేకులేరుకచ్చి
అక్రమ దొంగకేసుల్లో ఇరికి
చానతన్నులు పడి సిప్పకూడు తిని
చచ్చిబతికి బతికిచచ్చిన జైలు
పుట్టుడు సచ్చుడు ఒక్కటే తీర్గ
బతికినన్నాళ్లు పాడె మీద పన్నట్టు
ఇంక చెప్పలేనన్ని అర్హతలుండాలె
ఇగ ఎప్పుడైనా మాట్లాడేటప్పుడు
యాది మర్వకు
నువ్వెన్నన్న ఇద్దెలు నేర్చుకో
నా లెక్క కాలేవుగాక కాలేవు
మాట మాటకు నన్ను తిట్టకు
నువ్వు సచ్చి మళ్ళా పుట్టినా
పిచ్చకుంట్లోనివి కాలేవు గాక కాలేవు
పిచ్చకుంట్ల పనులు నీకు రానేరావు
నువ్వు నేను కావాలంటే
ఉత్త ముచ్చట గాదు
పుట్టెడు తవుసెల్లదీయాలె
ఈ తాప మళ్ళ గిట్ల పిచ్చకుంట్లోడివంటే
పి... పలగొడ్తం ...



# అమరుని నిర్వచనం!

నాళేశ్వరం శంకరం

ఆయుధానికి అంతం లేదు
దాని అంతిమ లక్ష్యం ప్రజారక్షణే
పోరుబాటలో ఇరుపక్షాలు ఆయుధాన్నాశ్రయించినా
ఆయుధం మాత్రం ధర్మానికి పర్యాయపదమే మరి!
దాన్ని నిప్పులోకి తోసినా ఆకాశంలోకి విసిరినా
హననం కానిది అదొక్కటే!

అమరుడు
మనిషిని నడిపించే ఆయుధంలాంటివాడే!
ఆయుధం పౌరాణికమైనా ఇతిహాసమైనా ప్రజాహితమైందే
రాముని బాణమైనా కృష్ణుని చక్రమైనా
శివుని నేత్రమైనా ఆయుధం ఆయుధమే!
మానవ దుఃఖాన్ని పరిష్కరించేది ఆయుధమే మరి!!

తెలంగాణ ఉద్యమానికి
ఎన్ని వైఫల్యాలు యెదురైతేనేమి
అమరుని ధర్మమే అంతిమంగా మిగలగలదు
చాపకింద నీరులాగా
కలిసుండే ఆత్మకథ అమరునికి తెలుసులే!





దుఃఖమున్నచోటే
ఆయుధం పురుడు పోసుకోగలదు
అమరుని ధైర్యంలానే అడుగేయుగలదు
దళారులకు ఆత్మలుంటే కదా!
ఉద్యమ బాలుని ఆత్మహననం అర్థమయ్యేది

అమరుని ఆత్మే ఆయుధం
అది ప్రజల జమ్మివృక్షం మీద అజ్ఞాతంగా బతకగలదు
ఒక్కో జమ్మిచెట్టే ఒక్కో ఆయుధమవుతున్న సందర్భమిది
నేడు మిత్రభేదమే మిత్రలాభం కనుక
కోవర్టు ఆయుధాలకూ
ఆయుధ కర్మాగారాలకు కొదవే లేదు
అవి ఉద్యమాన్ని మూటగట్టి
బంగాళాఖాతంలో పడదోసినా సరే
సముద్రం సైతం ఆర్ణవాగ్నినే వెదజల్లగలదు

అలనాటి ధర్మరాజు
పాలించడానికే కదా ఐదుగురికి ఐదూళ్ల నడిగింది
ఈ నేలవాసులడుగుతున్నది ఆయనలాగే కదా!
ఉద్యమానికి కాలనియమం లేదు గనుక
ఆయుధం అవిశ్రాంతంగానే పోరాడగలదు
ఇక్కడి ఆయుధం రైతాంగ పోరాటంలో అమరత్వం పొందిందే!

భారతం కూడా సమిష్టి బతుక్కు సున్నానే చుట్టింది
నేడయితే ఒక తల్లికి పుట్టిన బిడ్డలే
ఆరడుగుల నేలనైనా విడిపోవడానికే పంచుకునేది!
ఏ ప్రాంతపు భూమైనా ఆ ప్రాంతం వాళ్ళదే కావాలి కదా!
ఉమ్మడిగా ఉండమన్నపుడు ఉండాలనుకోవడమెందుకు!!
యాభైయేళ్ళ బట్టి
ప్రతి రోజును ఒక ఉమ్మడి విద్రోహ దినంగా భావిస్తున్నపుడు
తెగదెంపుల పర్వదినాన్ని ఆహ్వానించడమే మంచిది!
మన భాషా బంధుత్వాలైనా కలకాలం మిగలగలవు!!





ఆ

# ఆత్మ'హత్య'లు

బాణాల శ్రీనివాసరావు

ఇక్కడ ... ... .. .
ఆత్మ'హత్య'లు జరుగుతుంటయ్
దశాబ్దాల కాలంగా ...
కారణం పాతదైనా
ఆత్మ'హత్య'లు సమకాలీనం
...
న్యాయమైన హక్కు కోసం
కన్న నేల సంకెళ్ళను తెంచే
కోట్ల గొంతులు జీరలు పోయినా
వేలాది మంది రక్తం ఏరులై పారినా
వందల మంది కన్నకడుపుల కోసం శోకించినా
ఖద్దరు బట్టలకు రక్తపు చుక్కలు కాదు
చెమట చుక్కలైనా అంటవ్
...
కిరోసిన్ మంటల్లో ...
పెట్రోల్ మంటల్లో ...
కరిగిపోతున్న మాంసపు ముద్దలు

కాలిపోతున్న ఆత్మలు
తెలంగాణ ... తెలంగాణంటూ
ఆకాశాన్నంటే హాహాకారాలు చేస్తుంటే
శత్రువుల గుండెలు సైతం కరుగుతున్నా
ఖద్దరు కళ్లు చెమర్చవు
...
కన్నీళ్ళు రాలవు
...
వూడిపోయే పదవులకు వేళ్ళాడుతున్న
ఓ రాజకీయులారా
త్యాగవీరుల రక్తంతో దాహం తీర్చుకునే
చరిత్ర హీనులు ...
తెలంగాణ ద్రోహులు ...
మీరే ...





# ఆత్మగౌరవ కిరీటం

బూర్ల వేంకటేశ్వర్లు

ఒక గుండెకాయను
మరో శరీరంతో కలిపి కుట్టేసిన శస్త్ర చికిత్స
ఒక్క భాష పేరుతో
పరాయి కౌగిట బందీయైన విషాద చరిత్ర
కృష్ణా గోదారుల తల్లి రొమ్ములు
రక్తపింజరలు గ్రోలుతున్న బాధా సందర్భం
...
గుక్లె పలారానికి వెయ్యిన్నొక్క మొక్కులు
చేతిల తీర్థం పెట్టడానికి లక్షన్నొక్క విజ్ఞాపనలు
కాకుల గూటిలో జన్మించబడుతున్న కోకిలలు
...
ఎంత జొలెపోత పోసి అల్లినా
నువ్వు నాపై ఒడుపుగా విసిరిన వల
పెద్దమనుషుల ఒప్పందం
నువ్వు పచ్చబొట్టు పొడిపించుకోవడానికి
తయారైన ఫార్ములా
ముల్కీ నిబంధన సవరణ
ఒకానొక నీ చతురత్వ కళ ఆరున్నూట పది
నా ఆర్థికమూ రాజకీయమూ

సామాజికమూ సాంస్కృతికమూ
నీ గుప్పిట్లోంచి రాలుతున్న ఇసుక

అయినప్పటికీ నా విశ్వాసమొక్కటే!
మనో భూమిలో విత్తనమంటూ పడ్డాక
తాను చిట్లడం నేలను చీల్చడం తప్పుతుందా!
అరవై ఏళ్లుగా ఎదుగుతున్న నా కోరికాగ్ని
అంతుముట్టక ఆరుతుందా!

...

నే చెక్కబోతున్న జీవిత శిల్పం
నువ్విస్తాననే అంతస్తుల బలుపు కానేకాదు
నా చెదిరిన గూటిని అలిసిన కనుపాపల్ని
నా కనలిన బ్రతుకుల్ని
శ్రుతించే రతనాల వీణను
నేనాశిస్తున్నది చదరంగంలో పావు పాత్ర కానేకాదు
నా ఆత్మగౌరవం కిరీటించుకొని
రాజుగా వెలిగే సంపూర్ణ పాత్రను
నా స్వాతంత్ర్యం నా కమ్మని స్వర్గం నా తెలంగాణ.





# ఇది ఒక కామా ...!

వంశీకృష్ణ

సుమం రాలింది
సౌరభం గాయపడింది
వెన్నెల మరణించింది
చల్లదనం నిప్పుల ఉప్పెనగా మారింది

వుద్వేగాలన్నీ ఉద్యమాలు కానట్టే
ఆవేశాలన్నీ ఆలోచనలు కానక్కరలేదు
నిజానికి అబద్ధానికి మధ్య
ఆటకీ దొంగాటకీ మధ్య
జననానికీ మరణానికీ మధ్య
ఒక సన్నటి తెర ఏదో రంగస్థలం మీద
జారడానికే సదా సిద్ధంగా వుంటుంది

...

మరణానికి దేహాన్ని ఇచ్చిన అతడు
ఆత్మహత్యకి అర్థమేమిటంటే
నిరసనకి అది ప్రతిరూపం అన్నాడు
పదవులకి ఉద్యమాన్ని ఇచ్చిన అతడు

ఆత్మహత్యకి అర్థమేమిటంటే
అధికారానికి దూరంగా జరగడం అన్నాడు
ఇంతా చేసి
మరణానికి దేహాన్ని ఇచ్చిన అతడు కోరిందేమిటి?
వాసంత సమీరంలాంటి ఒక పూల పొదరిల్లు
మనసు విప్పుకోవడానికి హరివిల్లు లాంటి నెచ్చెలి తడి వొళ్ళు

...

ఉద్యమం ఈ దేశ రాజ్యాంగం కాదు
ఎవరు పడితే వారు సవరించి పారెయ్యడానికి
ఉద్యమం అదుర్స్ అనే తెలుగు సినిమా కథా కాలక్షేపం కాదు
ఎవరి ముందు పడితే వారి ముందు మోకరిల్లి
నేడే విడుదల అనడానికి

...

ఉద్యమానికి ఫుల్‌స్టాప్ వుండదు
కామాలు తప్పిస్తే ...!





# ఉద్యమం వర్సెస్ రాజకీయం

ఎన్.గోపి

ఎప్పుడైనా
ఉద్యమాన్ని ఉరితీయడానికి
రాజకీయం తాడు పేనుతుంది
నేలరాలిన శవంలోంచి
మరో ఊపిరి
ఊపిరిని మట్టిలో నాటితే
పోరాట వృక్షం మొలుచుకొస్తుంది
ఆకులు హరిత తరంగాలౌతాయి
ఆకాశం ముక్కు మూసుకొని
సముద్రంలో దూకుతుంది
చరిత్ర ఎప్పుడూ ఉద్యమం వైపే
రాజకీయాలే చీలిన పేలికలౌతాయి

ఉద్యమం గడ్డిపోచల ఆకాంక్ష
రాజకీయ తుపాకుల ఆంక్ష
ఉద్యమం పాట
రాజకీయం రెండు నాల్కల మాట

ఉద్యమం అగ్నిపునీత
రాజకీయం రంగులు మార్చే నేత

చావుకు తెగిస్తే ఉద్యమం
వేడుక చూసేది రాజకీయం
చచ్చినా పరవాలేదనుకునే
ఆ ఒక్క క్షణం ఉద్యమం
చావుల సంఖ్యను లెక్కించేది రాజకీయం
ఆత్మార్పణం ఉద్యమం
రక్త తర్పణం ఉద్యమం
బిత్తరపోయేది రాజకీయం
ఉద్యమంలో
విషబిందువులు రాల్చేది రాజకీయం
వాటిని అరిగించుకునేది ఉద్యమం
రాజకీయ రణగొణ
ఉద్యమం ఒక మహా ఉప్పెన

ఉద్యమం ఎక్కడి నుంచైనా రావొచ్చు
మట్టిలోంచి
చెట్టులోంచి
తెగిన ఊపిరిలోంచి
ఊదారంగు ఆకాశంలోంచి

ఉద్యమం ఒక ఉద్వేగం
రాజకీయం ఆగమాగం



ఉద్యమం పిడికిలి
రాజకీయం అలికిడి

ఉద్యమం ఒక బలిదానం
రాజకీయం తలా ఒక గానం
ఉద్యమం రేపటి తూర్పు
రాజకీయం మునిమాపు

ఉద్యమం జనస్వామ్యం
రాజకీయం ధనస్వామ్యం
ప్రజాస్వామ్యం పగుళ్లువారితే
ఉద్యమంపై మళ్లీ మరో ఉద్యమం
నిరంతరంలోంచి చిరంతన పద్యం



# ఉస్మానియా జామె ఉస్మానియా

సుంకర రమేశ్

పుస్తకాల్లోంచి లేచి వచ్చిన అక్షరాలు
శిరసెత్తిన ఉస్మానియా జామె ఉస్మానియా
పజ్జొన్న కంకులపై పాలపిట్ట జెండా
నా ఉస్మానియా
చదువుల ఖిల్లా
పిడికిలెత్తిన పాట ఉస్మానియా జామె ఉస్మానియా
తెలంగాణ తొలిసైరన్
ఉస్మానియా
తడి ఆరని ఉద్యమ చెలిమ
ఉస్మానియా జామె ఉస్మానియా
తెలంగాణ తల్లి సిగలో మెరిసే
నెలవంక నా ఉస్మానియా
శీతవేళ పురివిప్పిన ఉద్యమ నెగడు
ఉస్మానియా జామె ఉస్మానియా
రాత్రుల్లో రవిని నిద్రలేపిన
మందార దోసిళ్ళ ఉస్మానియా
నేలరాలిన పాలకంకుల
కన్నీటిబొట్టు ఉస్మానియా
నింగికెగసిన తారామాలిక ఉస్మానియా
గల గల ఊగె గుల్ మొహర్ కొమ్మ నా ఉస్మానియా
ప్రవహిస్తున్న పాట లయ ఉస్మానియా
రెపరెపలాడే పౌరుష పతాక ఉస్మానియా
కబుతర్ ఖవ్వాలి నా ఉస్మానియా- జామె ఉస్మానియా
గుల్షన్ గుండెపై లాఠీ కన్ను పడినా
రాలిన నెత్తుటి చుక్కలు
చెదరని స్వప్నాలను
చిదమ లేవు
చదువుల చిల్మన్
పైకి లేస్తే
గది గదిలో ఉదయిస్తున్న
వందాలాది సూర్యుళ్ళు



# ఎవుసం ఎతలు

ఓదెల వెంకటేశ్వర్లు

ఎవుసం ఎట్లా జెయ్యాలే
ఏళ్ల నోట్లెట్లా వెట్టాలే
సేతి ఏళ్ళను నాటేసిన
సిత్రంగా అంతా కలుపే మొల్సింది
కండ్లల్ల తవ్వటం బెట్టించినా
ఎక్కడ మొలక జాడే లేదు
నా గుండెల మీద ఎవడో
గుంటు గ్గొడుతాండు
అప్పుల పండించుకొనేతందుకు
నేను పెట్టిన తోట
మొలవకనే పాయే
కల్తీ కన్నీళ్ల పారినయుట
మేతకు లేక కోతకు పోయిన ఎడ్లు
పీల్చి పిప్పిజేసుకుంటాంఁడ్రుగని
కోసుకొని తింటలేడెవడు
నా పెండ్లానికెవడే వడ్డీల వొడి బియ్యంబోసిండు
తాటాకుకు పెదాలు అతికిచ్చిన
కండ్ల నీళ్లతోనే నిషా ఎక్కింది

ముల్లు కట్టెను ముడ్డికి గుచ్చి
బ్యాంకులోల్లు గెదుముతాంఁడ్రు
నా మొల్దారం దెంపి ముకుతాడు ఏసింఁడ్రు
ఈసారి కరెంటుకు నీళ్ళే షాటిచ్చినయి
పంటకు పీజెగిరిపోయింది
నాగలితోటి సంసారం చేసిన భూమాత
కడుపు దిగదాగినట్లయింది
ఇగ, బాధలన్నేమో గజ గజ వణుకుతున్నయ్
పురుగుల మందుకొడతనేమోనని ...



# ఎర్రమట్టి బండి

తైదల అంజయ్య

భూమి రెండు ధృవాల మధ్య
నిట్టనిలువుగా చీలినపుడు
మొలకెత్తే మొక్క వంటి ఆశ
బతుకును పరిహసించిన ద్రవ్యం
కరిగిపోవు సమయాన
రూపాయి గాలిమేడలు గుడిసెలను తూలనాడినపుడు
సిలికాన్ లోయలు విరిగిపడి
మట్టి చిగురించిన వాసన
మనసంతా జాజు తలుపు తెరుచుకున్న చప్పుడు
అలికిపూసిన అరుగు మీద ఆడుకున్నయాది
పసులనట్లా పచ్చగడ్డి మీద వదిలి
ఊశికె మైదానం నిండా
మట్టి బొమ్మల లోకాన్ని సృష్టించిన కాలం
ఆ పూట పొద్దు పొడుపుతో పాటే
ఒకానొక పురాచిహ్నం కదలివచ్చినట్టు
పొన్క నిండా ఎర్రమన్ను నింపుకొని
అతడు ఎడ్ల బండి మీద
పల్లెవాడల వెంట సంచారమవుతాడు
నేలను అడుగడుగునా అమ్ముకొనే లోకాన
ఇంటింటా పూతలు పూయించే తోటమాలి
చేండ్లకు ప్రాణం పోసే చేతులతో అలికే గోడలకు




తెలుసునా? చెమట పూలు పూస్తాయి
...
ఒక డాలర్‌ను నాటి
మిలియన్ డాలర్లను పండించిన
కాగితాలు మేసే లోహమృగం
ఎన్నాళ్ళు బతుకుతుంది?
ఆలనాడు విత్తనాన్ని నాటే మానవుడేం కలగన్నాడు?
విస్తరిస్తే మనుషుల్నే!
...
ఆ కాసేపైనా
వస్తు మార్పిడి వ్యవస్థను నెలకొల్పి
ఊరి మధ్యన నిలబడి అతడంటాడు
"నాకు పిడికెడు విత్తనాలివ్వండి!
మీకు దోసెడు మట్టినిస్తా!
నేను శిరసెత్తి రెండు బాహువులను
ఆకాశానికి చాచి
చుట్టూ జీవ బీజాలను వెదజల్లుతా!
మీరు పరిమళ భరితమైపొండి
శ్రమ బంగారు విద్యరా మనిషీ!
దాన్ని తాకిన ఏదైనా స్వర్ణమే"!
వస్తు బారిన పడకుండా నరుడు వర్ధిల్లాలని
ఏ మబ్బు కమ్మకుండా, ఏ నివురు కప్పకుండా
మనసద్దం మీద ఏ దుమ్ము పడకుండా
కాలం వంతెన మీద
కొనడి కుండలు మోసుకెళ్ళేవాడు
సదా మనిషొక మట్టిబండి



# ఒక అంతిమ వాక్యం సాక్షిగా...

దర్భశయనం శ్రీనివాసాచార్య

బాటలు అలసిపోయాయి
సింహాసనాన్ని వెదుక్కుంటూ వొచ్చిన
అతిరథ మహారథుల రథాల కింద నలిగి
అనుచిత ఉచిత అయాచిత వాగ్దానాల
పరమ కాలుష్య భారాల కింద విరూపమై

నిందల ప్రతినిందల ఆరోపణల ప్రేలాపనల
పరంపరల దిగజారుడు చేష్టల కింద సొమ్మసిల్లి
బాటలు అలసిపోయాయి

భూమి సంపదను భుక్తం చేసి ఇటు వేంచేసి
దూరాకాశాల్ని వాకిళ్లల్లో వాల్చుతామని
రంగు రంగుల కలల్ని జామ్ చేస్తూ
కళ్ల ముందు కరెన్సీని రెపరెపలాడిస్తూ
చేసే జంతర్ మంతర్ మాయా విన్యాసాలకు
బాటలు అవాక్కై అలసిపోయాయి

ఆ జెండాలు ఈ జెండాలు కలుస్తూ విడిపోతూ
అకారణ సకారణాల్ని కథనాలు కథనాలుగా
తీరైన అభినయాల్తో సమ్మోహన రాగంలో
వినిపిస్తుంటే విస్తుపోయి విరక్తితో
బాటలు న్యాయంగానే అలసిపోయాయి

చేతులూ కాళ్ల కళాత్మక మహాశ్రమతో
భూమిని ఫల సంపన్నం చేసే
సాధారణ ప్రజల అసాధారణ దైనందిన యాత్రల్ని
కోరుకునే బాటలు
అధినాయక పద ఘట్టనల్లో బీటలు బారాయి

రథాలు దిగి వాళ్లంతా విరామ సంధ్యలో
శీతల తీరాలకు తరలి వెళ్లి
కలల్ని రివైండ్ చేసుకుంటున్నారు
ప్రజల్ని అంకెల్లోకి కుదించి లెక్కలేసి
అంతిమ కాంక్షా పీఠాన్ని అధిరోహించడానికి
కొన్ని మొన్నటి మాటల్ని వెనక్కి తీసుకుని
ఇవాళ్టి కొన్ని తాజా మాటల్ని జత చేస్తున్నారు

బాటలు ఖాళీ అయ్యాయి, బీటలున్నాయి
బాటల్లో తడి లేనట్లే
అటూ ఇటూ పొలాల్లో తడి లేదు
సిరాను మోసే చూపుడు వేళ్లలో తడి లేదు
భూమిని బదలాయించినవాళ్లే
బతుకు తడిని పీల్చేశారని బాటలకు తెలుసు

బాటలు దుఃఖిస్తున్నాయి, ఎండిన దుఃఖం -
బాటలు అలసిపోయినట్లే
పొలాలూ, తడందని పైర్లూ అలసిపోయాయి
ఆశల్లోంచి తడి ఆవిరి కాగా రైతు
గాజులపల్లి నర్సింహారెడ్డి అలసిపోయాడు
తన అంతిమ వాక్యాన్ని తానే రాసుకున్నాడు
అలసట మరణంగా పరిణమించడం కన్నా
మహా విషాదమేముంది

ఇవాళ అలసిన పగుళ్ల దుఃఖపు బాటల మీద
గాజులపల్లి నర్సింహారెడ్డి మృతదేహమై
వెళ్తున్నాడు ఎండిన చేను దుఃఖాన్ని వెంటేసుకుని

పగుళ్ల నుంచి ఏ లావాలు చిక్కాయోగానీ
బాటలు ఆగ్రహ ఖండాలవుతున్నాయి
గాజులపల్లి నర్సింహారెడ్డి అంతిమ వాక్యం సాక్షిగా
ఒకే ఒక్క పిలుపునిస్తున్నాయి

'రైతులారా! కూలీల్లారా!
ఈ సారి పొలాల్లో మొక్కల్తో పాటు
గట్ల మీద బరిసెల్నీ నాటండి
బలంగా!'





క

# కవిత్వ న్యాయం

కాసుల లింగారెడ్డి

ఏనాడు
ఎదురు బొదురుగా
బరిలో నిలవనప్పటికీ
రాజా!
మనమెప్పుడూ బద్ధవిరోధులమే -

మెషీన్ల చెవి మెలిపెట్టి
విజయాలు నమోదు చేసుకోవచ్చు -
మెషీన్ గన్‌లు గురిపెట్టి
శ్మశాన ప్రశాంతత సృష్టించుకోవచ్చు -
కానీ,
రాజా!
కాలం 'కీ' మన చూపుడు వేలుకాదన్నది
చరిత్ర చెప్పిన పాఠం కదా!

సహచరుడు పెట్టుబడి పుట్టగొడుగుకు
పూసిన కుక్కమూతిపిందె -
నువ్వు తరతరాల భూస్వామ్య రాక్షసవృక్షపు విషపు పుండు -

పరిష్కారమావిష్కరించవలసిన
ప్రజాస్వామ్యపు ప్రహేళిక యవనికమీద
ఆటలాడుకుంటున్నావన్న వికృత విజయ హాస్యం -
కప్పలతక్కెడ తూకంలో గెలిచిన విషపు హాసం -
రాజా!
నువ్వు నిప్పుపెట్టిన సమాజ అగ్నిగుండం మీద నివురుగప్పి
రెప్పపాటులో నెమ్మదించలేను -
తగలబడి మసైన నీ దేహాన్ని చూసి సానుభూతిసాన కార్చలేను -
భాషనెక్కిరించి
యాసనెక్కిరించి
నీళ్ళు దోచి
నిధులు దోచి
మీవాళ్ళు
మా ఆశల బుగ్గిపాలు చేసి
మా అస్థిత్వాన్ని ప్రశ్నార్థకం చేసినప్పుడు
రగిలిన సింగరేణి నిప్పుకణికలమీద
నీళ్ళు చల్లితివి-
నా నేల దొంగెద్దుల దొడ్డి తప్పించితివి -
రాజా!
అరచేతినడ్డుపెట్టి తెలంగాణ పురుడాపిన నిన్ను
చరిత్ర మరిచిపోదు -

చర్చల గొంగడి కప్పుకొని
గూడెం మందల కలిసితివి -
మాటలు కలిపి



మర్మం కనుగొంటివి -
మా అమాయకత ఆసరాగా
మాటుగాసి కాటువేస్తివి -
చిందిన వీరుల రక్తంతో నిటారుగా నిలబడ్డ నల్లమల
ప్రతీకారమంటావో
ప్రమాదఘటనంటావో
రాజా!
తరాజును సమతూకం చేసింది-
కవిత్వ న్యాయాన్ని కళ్ళకద్దుకుంది -



# కొన్ని నిమిషాలు

అఫ్సర్

ఇప్పుడింక
అన్ని చావుల్నీ
రెండు నిమిషాలతోనే కొలుస్తున్నా
రెండు వందల మరణాలు రెండు నిమిషాల మౌనాలు

...

రెండు వందల తల్లుల పేగులు
పెనవేసుకుంటున్న మానవహారాల రాస్తాలు
ఎవరికెవరు క్షమాపణ చెప్పాలి?
ఈ రెండు వందల ఖూన్లకి మాఫీ ఏది?

...

ఎప్పటికప్పుడు చావు కొత్త అర్థం తొడుక్కుంటోంది
చొక్కా మార్చినంత తేలిగ్గా
మాటల్ని విడిచేస్తోంది సర్కార్.
ఎవరి మాట ఎక్కడ కొలువు కుదురుతుందో
ఎక్కడ కొలువు తీరుతుందో
ఏ కొలువు మమ్మల్ని నిలువునా ముంచేస్తుందో
తెలియనే తెలియదు
అ... యి... నా...
రెండు నిమిషాల్లోకి
నీ ... నా చావులన్నీ మడత పెట్టేస్తున్నా
ఎవరికంటి నెత్తురు



ఎవరి ఇంటి వెల్తురు
రోజూ వచ్చి పలకరించే చావు
ఎవరి పంపకాల రాయబారం?
అమ్మా,
ఈ నేల చీలిపోక తప్పదింక.
వాళ్ళు కూడా చిమిడిపోయిన అన్నం వాసనేస్తుంది
దీని నెర్రల నిండా ఆకలి గుహలు మొలుస్తున్నాయి
ఎప్పటికప్పుడు చావు కొత్త అర్థం తొడుక్కుంటోంది

...

కొన్ని నిమిషాలు నన్ను వెలివేస్తాయి
కొన్ని నిమిషాలు నన్ను శిలువేస్తాయి
కొన్ని నిమిషాలు నన్ను నీలోకి వొంపి
నీ శరీరపు వేడిని తాకి వస్తాయి
బతుకు వొక వాంఛ చావులానే
చావు వొక గడ్డిపోచ బతుకులానే
రెంటి మధ్య
బహుశా రెండు క్షణాల దూరం
ఆ దూరాన్ని చెరిపి
నువ్వు జ్ఞాపకంలోకి జారిపోయావు చెప్పా పెట్టకుండా
రెండు నిమిషాలు నీ జ్ఞాపకం
ఆ తరువాత నువ్వు ప్రవహించే రాస్తా
ఎప్పుడూ పేగులో సలిపే గాయం
ఇప్పుడింక ప్రతిచావునీ
రెండు నిమిషాలతోనే ...
కొలుస్తున్నా



# గర్భం దాల్చిన మేఘం

డి. ఉదయ్ భాను

వేలస్వప్నాల సమాధి కనుపాప
ప్రవహిస్తున్న నెత్తురుటేర్ల ఒడ్డున కూర్చొని
వెలుతురుపూల వనాల కోసం
ఎదురుచూస్తోంది

...

కసాయి కాలంలో రాల్చబడిన ఆకులు
చెట్టుపాదాలవద్ద
కోటి ఆకాంక్షలతో
కొత్త చిగుళ్లను నినదిస్తున్నాయి

...

పాటపాడిన గొంతు పదిహేడు ముక్కలైనా
ఒక్కోభాగం
నాలుక్కోట్ల గొంతుల రణన్నినాదాన్ని
కసిదీరా పాడుతున్నాయి

...

చెట్టుపై వాలిన పచ్చ్రంగిపిట్ట
చెట్టేనాదని కడుపును తొలుచుకువెళుతుంటే
మట్టివేళ్ల జీవశక్తి రంగరించుకున్న ఆకులకు
బాకులయ్యేశక్తి
గాలే నూరిపోస్తోంది

...

గోధూళి ...
అస్తమయ సూర్యుని యుద్ధతంత్రాన్ని
చీకటి వాకిట్లో ఉపన్యసిస్తోంది
రాలిన చుక్కలు
సూర్యున్ని మోసుకురావడానికి బయల్దేరిపోయాయి

...

బతుకు వీణను
ఎడారి ఒంట్లో పెట్టుకుని
కరువు వేళ్ళతో మీటుతుంటే
శ్మశాన నిశ్శబ్దం
వెచ్చగా వెలువడుతోంది

...

బీడుభూముల్లోని గడ్డిపరకలు
అరుణవర్ణాకాశపు కొంగు కింద
చారిత్రక సత్యాల్ని విశ్వసిస్తున్నాయి

...

నువ్వు + నేను = నువ్వే
నేను - నువ్వు = నేను
నన్నొక్కన్నే ఉండనియ్యి

...

పాము
గుడ్లనేకాక గూడునూ మింగేస్తుంటే
రక్తం గడ్డకట్టుకుపోయిన పిచ్చుక ...
ముక్కును ముంగిస నోరు చేసుకుంటోంది

...

మా రెండు కళ్లనీళ్లు

పరాన్న భుక్కు కడుపులోకి వెళ్తున్నాయి
అవి నీళ్లు కావు
కాలుతున్న శవాలు, వాటి కలల సమ్మిళిత మిశ్రమం
...
ఓ కాటికాడి కబోదీ
హృదయం ఆకాశ స్వచ్ఛతతో తెరిచి
మానవత్వ పారమాత్రమే మిగిలేదాక
కళ్లను నులుముకొని
మోకాళ్లపై కూర్చొని
పిడికెడు మట్టిని చేతిలోకి తీసుకొని చూడు
వలసెల్లిన పాదాలు కార్చిన కన్నీటి చారలు
రాశులు రాశులుగా కలల శకలాలు
పగిలిపోయిన కనుగుడ్లు
బోకిబిచ్చలైన అటికె, గురిగీలు
తడి తడిగా తగిలే నెత్తురువాసన
ఆకలి కేకల సమూహాలు
పక్కనే పారాడుతున్న పోరాటం కనిపిస్తాయి
...
కాలం స్తబ్దుగా ఉందంటే
ఓటమి రాజా అయినట్లు కాదు
గర్భం దాల్చిన మేఘం
గంభీరంగానే ఉంటుంది
...
శాంతి చెంపలు ఎర్రబారకముందే
యుద్ధం తీరం చేరుతోంది





# గాయం

బెల్లి యాదయ్య

మనమొక దేశమని
చెప్పేవాడు తాత
తనొక నిరక్షరాస్యుడు
1948 అవతలి బానిస -

మనమొక రాష్ట్రమని
కొట్లాడేవాడు నాయన
తను ఓనమాలు మాత్రమే తెలిసిన చదువరి
1956 నాటి పాలేరు -

మనమొక ప్రాంతమని
నినాదం ఎత్తుకునేవాడు కొడుకు
తను డిగ్రీల మెట్లెక్కిన మహాజ్ఞాని
1969 మోసానికి ప్రత్యక్షసాక్షి, నిరుద్యోగి -

మనమొక సెజ్ అని
గ్రాఫ్ గీసుకుంటున్నాడు మనవడు

తను ప్రపంచాన్ని చుట్టొచ్చిన వైమానికుడు
2005 అనంతరం నిర్వాసితుడు-

విన్నారుగా
తాత నుండి మనవడి వరకు గాయాల కథను
దేశం నుండి సెజ్‌దాకా కాలిన ఎదను
ఇక మీరే కాంక్షిస్తారు తెలంగాణ ఏర్పాటును
ఇక మీరే తొలగిస్తారు రాజకీయ గ్రహపాటును -







# గాయమెప్పుడూ బాధాకరం కాదు

గాజోజు నాగభూషణం

ప్రాణాల్ని త్యాగాల బాటలో
పోరు జండాలై నిలిపిన వారికి
కాలం ... తలవంచిన గులాం!
గాయమెప్పుడూ బాధాకరం కాదు
అది కసినో ... కాలాన్ని మార్చే ఋషినో
తప్పక ఆవిష్కరిస్తుంది
మరణమేనాటికీ వృథాగా పోదు
అది క్రాంతినో ... శాశ్వత శాంతినో
భువిపై అంకురింపజేస్తుంది
నిత్య విస్ఫోటనం చెందనిదే
సూర్యుడు నిప్పులు చెరిగేనా
తనువు నిలువెల్లా చీల్చనిదే
భూమి ప్రాణదాతయై నిలిచేనా
తమను తాము కాల్చుకొని
తుపాకులతో పేల్చుకొని
ఉరితాళ్ళను ముద్దాడి
మరణాల మాలలను
చిరునవ్వుతో ధరించిన యోధులారా!

స్వప్నించిన మీ ఆశల సాక్షిగా
మీ బలిదానాల పునాదిపై
బంగరు తెలంగాణ నిర్మిస్తాం
కన్నతల్లి విముక్తికై కదులుతున్న బిడ్డలారా ...
త్యాగాలు పరిహసించబడుతున్న వేళ
గాయాల కసినే పెంచాలి
ప్రాణాలు అత్యంత విలువైన వేళ
నిలిచి కలబడే కర్తవ్యాన్ని బోధించాలి
నేటి పోరాట ఫలాల హక్కుదారులు మీరు
రేపటి తెలంగాణ నిజ వారసులు మీరు
అమరుల ఆశయ వారసత్వాన్ని అందుకొని
అడుగులో అడుగేసి కదులుదాం
గడప గడపలో చైతన్య దీపాల్ని వెలిగించి
ఆ వెలుగుల్లో వీరుల రూపాన్ని వీక్షిద్దాం





గూ

# గూంగా షాయర్

రాజా హైద్రాబాదీ

నేను చిన్నప్పుడు
పండక్కి అమ్మతో దిగిన
అరుదైన ఫోటో
ఈ చార్మినార్

పిల్లాడు
ఏడుపు మానకుంటే
చందమామను
కిందికి పిలవడానికి
మేడమీదికి వెళ్ళినట్టు
నాకు మూసీ నదిని
దగ్గరగా చూపడానికి
ఇప్పటికీ నిలబడేవున్న
మా అమ్మ నయాపూల్

నా సంతోషం కోసం
పుట్టిన రోజు కానుకగా
మా అమ్మ దాచి వుంచిన
కొత్త గ్రీటింగు కార్డు
కూలిపోగా మిగిలిన కోట
ఈ గోలకొండ

చెడావు ఎక్కని రిక్షాని
వెనుక నుండి నెట్టినపుడు
మా అమ్మ నవ్విన నవ్వును
పువ్వుల్లా పరిచిన
పరిమళం ఇగిరిపోని
అత్తరుబుడ్డీ
ఈ శాలిబండా

ఎండ తగలకుండా
కూలింగు గ్లాసులు పెట్టుకొని
ఫుట్‌పాతు అరుగుల మీద
నన్ను నడిపించిన అమ్మకొంగును
మాయని గొడుగులా
నా తలమీద కప్పిన
పత్తర్ గట్టీ రాతి స్తంభాల నీడలు

ఎవరిదో దావత్‌కి వెళ్ళి
జేబుల నిండా తెచ్చి
అమ్మ చేతిలో పోసిన
గులాబి రేకులు
ఈ సాలార్ జంగు మ్యూజియం
వాడిపోని రంగులు

హోళీ నాడు
పిచికారికోసం అలిగితే
బుజ్జగించినప్పటి

మా అమ్మ చేతిమీది
గోరింటాకు చిత్ర విచిత్రాలు
ఎప్పుడూ మరిచిపోనివ్వని
ఈ మంత్రలోకం లాంటి
ఆబిడ్స్ నగిషీల నజారాలు

వేసవి సాయంత్రం
కరంటు వెలుగుల్లో
మా అమ్మ ముఖం
పద్మంలా ప్రతిబింబించే
పురాతన అలల నిలువుటద్దం
ఈ తడి వెన్నెల ట్యాంకు బండు

ఇంద్ర ధనుస్సును మడిచి
కొప్పులో తురుముకొని
మా అమ్మ వేసిన
ముత్యాల ముగ్గు
ఈ వన్నె తరగని ఆర్ట్స్ కాలేజీ

నేను ఆడుకోవడానికి
నెమిళ్ళ వెంట వెళ్ళినప్పుడు
నన్ను వెతకడానికి
మా అమ్మ తిరిగిన చోటల్లా
'చౌమహల్లా ప్యాలేసు'ల్లా వెలసి
ఈ హైదరాబాదు నగరం
దీపాల దీవిగా మారింది

నాకు బుద్ధి తెలిసింతర్వాత
కొద్ది కొద్దిగా అర్థమైన గజళ్ళు
నా తల్లి అడుగులు ముద్రపడిన
ఈ సందు గొందుల గల్లీలు

ఇదొక స్వప్నం
తీయని జ్ఞాపకం
బతికించే గాయం
మారుమోగే గానం
దసరాకీ రంజాన్‌కీ
మురిసిపోయీ వెదజల్లే
ఊదుపొగల కమ్మదనం

నేను సీతాకోక చిలుకల్ని పెంచే
పాతబస్తీ మూగ షాయర్నీ
ఎవరు రాయి విసిరినా
రెక్కలు విరిగిపోకుండా
గుండెను అడ్డంపెట్టే
అనాడి ఫకీర్నీ

షెమ్మా వెలుగుతోంది
నేను కరుగుతున్నాను
పరదాను పక్కకు లాగకండి
మా అమ్మ నిద్రపోతోంది





# చెమటచుక్కే

వడ్డెబోయిన శ్రీనివాస్

మట్టిమీది నాగలి సంతకం
నీళ్ళమీది రాతైంది

నడిచి నడిచి
బాటలే అలిసిపోయిన
మట్టిగుండెల్లోని ఎడ్లబండి
మట్టికాళ్ళ మహారాక్షసి మింగింది

ఎద్దుల గిట్టల్లో
పంటల పొద్దు బొడ్సిన నేల
గొడ్రాలితనం గోడలై లేసింది

చెమట చుక్కలు మొక్కలైన చోట
చదరంగం మొలిచి
రైతు పావైయ్యాడు
ఒళ్ళంతా పిండిచేసి
నేల మీద
పండు వెన్నెలకు ప్రాణం పోసిన
పంట చేనుల మనసులోడు
పండ్లేకాయని

చెట్టైపోయాడు

మట్టిలో ప్రాణం చిలుకను దాచుకున్నోని మట్టి
రాతి చట్టాల్లో సమాధైంది
'సెజ్జు' ఖడ్గం బ్రద్దలు చేస్తున్న
చెమట చుక్కను
పరిహసిస్తూ
రాజ్యం
రాజకీయ దుకాణంలో కూర్చుంటే
మార్కెట్టు
అధికారం గుర్రమెక్కింది

మనిషికిక
మట్టికూడా లేదు బుక్కడానికి!
ప్రత్యేక దుఃఖాభివృద్ధిలో
తుపాకి రాజ్యం
తలమునకలైయ్యింది

నాగలి ధామాలు
నరకం చిరునామయ్యాక
పంట భూముల సడుగులిరిగిన
మట్టి మనుషుల
చిట్ట చివరి ఆత్మహత్యలెగుస్తున్న కాడులై
ఊళ్ళు సూర్యుణ్ణి కౌగిలించుకుంటున్నాయి

న్యాయం నెత్తుటి మరకంటని



పగలూ లేదు
రాత్రీ లేదు
ఈ ఆకాశం మీద
ఎప్పుడూ చీకటే వాలింది!
గోమార్లు పట్టి మట్టి
కుట్రలో చిక్కింది

నాగలి తాకి
నవ్విన భూమి బుగ్గలపై
దొంగ నవ్వుల చారలు కట్టాయి

జీవితాలకు
రంగులద్దిన మట్టి
గురువింద నీతి చేతుల్లో పాలిపోయింది
ప్రేమల్ని
ప్రాణాల్ని పంచిన
పేగు తెగిన భూమి
రూపాయి ప్రేతకళ యాతన పడుతోంది

బతుకు పుష్పించి పరిమళించిన
జీవప్రవాహ భూమి
బతుకులోంచి
నిశ్శబ్దంగా జారిపోయింది
ముసలికారుమబ్బుల్ని చూసి
ముసి ముసి కలలు కన్న భూమి
పెకిల్చిన కనుగుడ్లతో

కబోది అయ్యింది

ఆకలి పేగులు ఆడిపాడి
ఆనందం పంట తీసిన
ఆ నేల మీద పుష్పొడి రాలదు
ఆ నేల మీద పరిగేరుకోం
ఆ నేల పిచ్చుక జ్ఞాపకం కూలిపోయింది
ఆకలికి నిప్పుపెట్టిన
కొంగల బారుల నీడల
ఆ నేల చరిత్ర మౌన ముద్రలో
నేల మట్టమైంది

ఓటు మోసం చేసిన
ఎద్దు నడిచిన నేల
మొద్దు బారింది

ఒక ముక్కు పచ్చులారని స్వప్నం
ప్రత్యేక మృత్యుమండలంగా బ్రద్దలై
చెట్టెండిపోయినట్టు
చెరువెండిపోయినట్టు
చెమట మట్టి చిగుళ్ళ రైతెండిపోయాడు

వీరోచితంగా
నాగలి తొక్కిళ్ళ విత్తులు చల్లి
చెమట తుట్టె ఛిద్రమయ్యే
యుద్ధం చేసి



మట్టి పువ్వును చేసి
ఆకలి కడుపుల్లో
నాగలి వసంతాల్ని కురిపించిన
స్వేద రేవుల్లో
స్వదేశీ జ్వాలల విదేశీమంటబడ్డది

పచ్చని పంట భగ్న పొలాల్లో
కంచాల్లో కుప్పబడ్డ
ఖాళీ పేగుల్నెక్కిరిస్తూ
ఇత్తుల వర్షం కురిసే భూమి
బ్యాలెట్ పెట్టెలోంచి లేచిన
ఇనుప సింహాసనం మింగింది

ఇక్కడ
వరి స్వరసంగీత శిథిలాల్లేవు
ఇక్కడ
మామిడి మధుర మంజుల రాగసుధని
ఇనుపతేలు కాటేసింది
ఇక్కడొక
కొబ్బరి నీడ మబ్బుల మందహాసానికి
కోట్లాధిపతుల కోరికల చితిపై
అంత్యక్రియలు జరిగాయి
ఇక్కడొక
సపోట తోట  సౌందర్యం
సజీవ దహనమయ్యింది

ఇక్కడే
జీడి మామిడి ముతక జీవితం
జీవగంజిలేకుండానే ముగిసింది
రైతు రాల్చిన స్వేద బిందువు
చరిత్ర దగ్ధమైంది
మెతుకులు పంచే చేతుల
మెతుకు లాక్కోవటం
గద్దల రాజ్యం
చట్టబద్ధ పాలనయ్యింది

స్వచ్ఛంద అబద్ధాలు
ప్రకృతి సంభాషణ భాష
చెమట చేతుల భౌగోళికత్వాన్ని
చెరబడుతానై
తుమ్మెద గుంపులు కరిగిన
ఒరం జెక్కిన చేతులు
ఓరకు బడ్డై

మడికట్ల నిండా
వరినాట్ల అల లలికిన చేతుల్ల
ఆకుపచ్చ చెలిమె ఎండింది

బంతికొట్టిన చేతులు
తూర్పారబట్టిన చేతులే
తావైపోయినై
దుక్కులు మధించి



అమృతం పంచిన చేతులు
దుఃఖ తిర్నాల్లైనై
రాజ్యం
నాగలి జెండె ఒరిగిన భూముల
బ్రోకరైయింది

ఎవడి కలల విశృంఖలత్వం కోసమొ
ఎకరాల కొద్ది జీవితాల్ని చిక్కు చిక్కు చేసి
నెత్తుటి బంధాల్ని తెంపింది
మట్టి చేతులు పచ్చగా చిగురించిన
మట్టిని గుప్పిట్లో పట్టడంగా
భూస్వాధీన నోటీసుల్లో
భారత స్వాతంత్ర్యం
బహుళజాతి విషకౌగిలిలో
బందీ అయ్యింది
ఈస్టిండియా కంపెనీ
ప్లాస్టిక్ సర్జరి చేసుకొని
సెజ్జెయ్యింది

భూ సంస్కరణ గందరగోళ సంగీతంలో
భూస్వామ్య వ్యవస్థ రద్దు పాటతో
కొత్త జమిందారి పెత్తుమ్మ వనానికి
కన్నుబొడ్చుకున్న రాజ్యం
సార్వభౌమత్వ సరిహద్దుల రద్దుల
సౌందర్యాన్ని పరిచింది
ధృతరాష్ట్రావతారమెత్తిన ధర్మపీఠం

కింద
తన రాజ్యాంగానికి
తనే లక్ష్మణరేఖలు గీసింది
తన ఒంటి పర్యావరణానికి
తనే పక్షవాతాన్ని అమలు పరచుకుంటోంది

'సెజ్జు' రాజ్యాలకు
తనకుతానే మరుగుజ్జై
కాందిశీకురాలుగా ప్రకటించుకొంటోంది
ఇంకేం
సామ్రాజ్యవాదుల విందు
ఒరం మీది
ఆరుద్ర పురుగుల మీద
ఖడ్గం దూసి
వాన పాముల్ని ముక్కలు ముక్కలు కోసి

లక్షల ఎకరాల రాచపుండ్ల
ముచ్చట పడి పురుడు పోసి
రాజ్యం
ముద్దు పెట్టుకుంటోంది

ఇప్పుడు కదా!
అభివృద్ధి రహస్యం తెల్సింది
దారిద్ర్య రేఖ శతాబ్దిలా పరుగెడుతేనే
ధనికరాజ్య జిడిపి రాకెట్ దూసుకుపోతుంది
మానవాభివృద్ధి రేఖ మాసిన తలతో



సోమాలియా, ఇథియోపియా
కింద
సొమ్మసిల్లి పడిపోయింది

వంశవృక్షం
రాజ్యమై విస్తరించిన చోట
వందల యేళ్ళ చింత చెట్లూ ... పిట్టా ....
గూడూ ... కూడూ ... గుడ్డా ...
కూల్చబడుతుంది
కాని
మట్టిలోకి కాళ్ళు విస్తరించి
మట్టిలోకి మనిషే విస్తరించి
మట్టిలోంచి సూర్యుళ్ళను పుట్టించే
మహాయోధ చెమట చుక్కే!
మనిషిని నిర్మిస్తుంది
మట్టికాళ్ళ మహారాక్షసి
మరణం నిర్మిస్తుంది
మట్టికి
పట్టం కడుతుంది
భూపోరాటాగ్ని పర్వతంలోంచి
భగభగ మండే చెమట బిందువుల
మట్టిమనిషి
సెజ్జు మీంచి లావా ప్రవహించి
భూమి దుఃఖాన్ని కడుగుతాడు
చెమట చుక్కకు
జై కొడతాడు



# జల(గ)గానం

హనీఫ్

ఒరేయ్!
రావటం రావటమే
రసోయి ఘర్‌లోకి దూరి
ఇమిడిపోయే నీ సహజ శైలికి
ముగ్ధుడనై నందుకే ...?!

హార్ట్‌ని టచ్ చేసే
మాటతీరు
ఈస్టిండియా కంపెనీ వ్యాపార నీతి
తర్ఫీదు లా అన్పించలేదు
నీ మాటల్లో
ఊటలు, ఎండమావులు
మావులో చిక్కిన చేపపిల్లనైనప్పుడుగ్గాని
తెలిసి రాలేదు!

నా వీధిలోకి వచ్చి
నా వాకిట్లో నిల్చోని
సైట్ కొట్టి



నీ 'సై' ఆట ఎరగుచ్చిన గాలం అన్పించలేదు
ఇప్పుడు ఇన్పించే ప్రేమ కహానీలు
నా గల్లీల
నా మీనార్ల చుట్టూ ప్రదిక్షణల జ్ఞాపకాలు
నెంపర్లాటలు, నెమరేసుకోవడాలు
జీహోలకు, జీహోలు స్వాహా చేస్తున్నప్పుడు
జ్ఞప్తికి రాకపోవడం
అదే శ్వేతనీతి!!
నీ జల నీతిలో
నిన్ను దొంగలా పోల్చుకోలేక పోవటం
నా తప్పిదమే

ఇల్లు చక్కదిద్దుకోమని
వెలుతురు దివిటీ చేతికిస్తే
నా వాకిట్లో ఎందుకు పాతావో
అప్పుడు అర్థం కాలేదు
పరాయి ఇంటిని దోచుకునే మర్మం
మా తడి హృదయాలకు తట్టలే

ప్చ్ ...!!
చివరికి నేస్తానివే నంటాను!
రక్తం పీల్చిన తీపిజ్ఞాపకాల్ని
జలగలాగా?
తంబాకు నములే పాత అలవాటుకు
నన్ను నెట్టకు



# జీవ వాంగ్మూలం

శ్రీనివాస్ దెంచనాల

ఒక ఉరికంబాన్ని బహూకరించారు వాళ్లు
నేను యే మర్యాదల్నీ పాటించలేదని
ద్వితీయ శోభనపు దీపమార్పలేదని

ఛే ఫీట్ భూకందకం సిద్ధం చేశారు
ఎవరి సంఘంలోనూ చేరలేదని
యే దైవగడపకూ పసుపు పూయలేదని

రాత ప్రతులకు అగ్ని అంటించారు
నా యవనికల్ని చింపి పారేశారు
గ్రామ గ్రామ బొడ్రాయి దగ్గరా, సిటీసిటీ సెంటర్‌లో -
- నగ్న దర్పణాల కర్మాగారాలు పెట్టానని
యెప్పుడూ రాకాసి బల్లిని రాజుగా ఒప్పుకోలేదని

తన చెల్లె చెయ్యిలాగానని వొక మిస్ వరల్డ్ కేసు పెట్టించింది
ఆమె ఉన్నత స్తనాల్ని ఉద్రేకంతో చూశానని
తన తొడను వీడు తాకడెందుకని
గొర్రెలు నాపై రాళ్లు రువ్వాయి
వాటితోపాటు వోటు వేయలేదని
యెటో వొకవైపు దూకిపోలేదని
కవి కాయంలో దాక్కొని స్పృహ పింఛం చేతబూని నా మయబ్రహ్మల్ని -



మాయం చేసి నన్ను వన్ని చోరుడన్నది జెలసీ జెడల లఫంగివొకతి
వాడి భ్రష్ట గద్యాన్ని పద్యమనలేదని
నన్ను సమాధి చేసి తాను మొలకెత్తుదామని

ఖనిజ వృక్ష జంతు మానవ రాజ్యాల ప్రేమాధిపతిని
సమస్త జీవ నిర్జీవ పరమాణువుల్లో పద్మాసనం వేసి వున్నాను
సృజనలో ఉన్నాను - టక్కుటమార గోకర్ణ గజకర్ణ ఇంద్రజాలాల్లో లేను
సృజనపై ఉన్నాను - రాతిగార్దభమై లేను
సృజనతో ఉన్నాను - కీర్తి కాంత అధికార వాహన -
- వస్తు కనక ధన శ్మశానాల్తో లేను
సకల గ్రహాల సర్వ స్థలాల్లోనూ, శూన్య పాతాళాల్లోనూ
రాత్రీపగలూ సాయం ఉదయాల్లోనూ
ఎక్కడా ఎప్పుడూ ఎవరూ
చచ్చినా చంపలేరు మీరు నన్ను
యేల అనగా
మీరు జీవించి వుంటే నేను మరణించి వున్నానని అర్థం
మీరు మరణించివుంటే నేను జీవించి వున్నానని అర్థం



# జీవిత గానం

వేముగంటి మురళీకృష్ణ

మౌనాన్ని కొంగులో దాచుకొని
గింజలై రాలిన ఆనవాళ్ళ ముఖాల్ని ఎత్తుకొని
మెదడు నిచ్చెన మెట్లెక్కుతున్న

నాళాల కుహరాల్లో నిక్షిప్తమైన
అనుబంధాల వరసల్ని నిద్రలేపి
సమస్త ప్రజల ఆకాంక్షల్ని చూపుడు వేలి మీద అంటించుకుని
గమ్యం దిక్కు సాగిపోతున్నా
పుట్టుమచ్చలా చెదిరిపోని చిహ్నాల్ని
వంటినిండా పూసుకొని
నినాదాల పాదాల మీద నడుస్తూ
శబ్దానికి నిశ్శబ్దానికి మధ్య మొలుస్తున్న
తీగల్ని పెనవేసుకుని అడుగులేస్తున్నా
మట్టి లోలోతుల్లోకి అల్లుకుపోతూ
ఆకాశం రెండుగా చీలిన మధ్యాహ్నం పూట
గొంతెండిన ఊట చెలిమల్ని తడిమి



పాలకుండల్ని దాచిన ఉట్లు
ఉరితాడు లెక్క ఊరుతున్న ఇంటి చూరు
ముందు నుంచి
ప్రవాహంలా ఉరుకుతున్నా
నిస్సిగ్గుగా నల్లమబ్బులు దూదిపింజల్లా
కదలిపోతూ
కంట్లో నిప్పులు కురిపిస్తున్న దృశ్యాల్ని చూస్తూ
శూన్యంలోంచి నిర్భయంగా నా తెలంగాణ
నేల మీదకి ప్రయాణం చేస్తున్నా



# తెగిన బంతిపూల దండ

సీతారాం

మరణమే మా  రణం అంటున్నరు
ఈ పిల్లలు
నిండు బతుకుల్ని అట్లా గిరాటేస్తున్నరు
ఈ త్యాగులు
వీళ్లకి వ్యక్తిగత ఆస్తుల్లేవ్
రియల్ ఎస్టేట్లు లేవు
కూసిన్ని కలలు కొన్ని పుస్తకాలు
ఇంకొన్ని మార్కుల మెమోలు
అబద్ధాలతో, మోసాలతో
ఎటుపడితే అటు తిరిగే నాలుకలు కావు
వీళ్లవి
చావును చచ్చిపో అంటున్నరు
మాకు తెలంగాణ ఇచ్చిపో అంటున్నరు
కళ కళ లాడాల్సిన పిల్లలు
కలత చెందుతున్నరు
కలలు చెదిరి





వీళ్ల జేబుల్లో కరపత్రాలున్నై
నీలాగా, నాలాగా కరకు కత్తులు లేవు
బ్రతకలేక చనిపోయిన వాళ్ళు కాదు
వీళ్లు
బ్రతుకుల్ని బంతిపూల్లాగా తెంపి
తెలంగాణ తల్లికి హారమై పోతున్నరు
ఇన్ని మరణాల్ని తోరణాలుగా కట్టి
ఏమి త్యాగమిది
ఏమి మరణమిది

ఎక్కడ చచ్చార్రా మీరు
ఎప్పుడు బతికార్రా మీరు
సచివాలయాల్లో, సంసద్ సదన్లలో
ఎందుకు బ్రతకాల్రా మేమంతా?



# దప్పు సప్పుల్లతో దండోరేసే నారోజెన్నడో?

జూపాక సుభద్ర

ఓ పెద్దమనిషన్నట్లు
నేను 'కోటి రతనాల వీణనేమోగాని
కోటి గాయాల గడ్డను అనేది నిజం

యింకా సబ్బండ సమ్మక్క సారక్కలకు అడ్డనని
పోరాటాల సాల్లు బోసిన పోషమ్మ మైసమ్మ వుప్పలమ్మ వూరడమ్మల
బిడ్డనని మాత్రమే తెలుసు
నా ఆడిబిడ్డెలు ఎండకన్నెరగనోల్లుగాదు

ఏడు ముట్టెల్ల  కాలం పిల్లాది మారకాంచి
పోరుల పొర్లాడుతున్నోల్లు
గానాడెన్నడో సాయుధ పోరాటంల
తుపాకులు బట్టి తూటాలు తొడుక్కోని
గడీలల్ల బరిబాతల బత్కమ్మలాడిచ్చిన
దొరలకోరల్ని వొలిచినోల్లు

మిలట్రీ మిడతల దండు కండ్లల్ల కారం ఫిరంగులు జల్లి
వూరావలికి వురికిచ్చినోల్లు
గియ్యాల పొట్ట తట్టల వెట్టుకొని పట్నం బోతుండ్రు

రోడ్లకు కంకర్లై, భవంతులకు సిమిట్లై యిటికెై
యిండ్లల్ల పాసి పనై
బిడ్డలకు బుక్కెడు బువ్వ బెట్టలేక అడ్డాల్నాడే అమ్ముకుంటుండ్రు
అడ్డాల మీద కుప్పబోసిన కూలి సరుకైతుండ్రు

బతుకే సావైన కాడ అక్షరాల మెతుకులకు యాడికి బోదును
యెన్నెలై పారిన నాయేటి యెదలు సీకటి డొక్కలైనయి
సింగిడై పొంగిన నా గొలుసుకట్టు కలలు సెదపురుగులు దిన్నయి
నా పల్లె సెట్టుకు ఆకు అంటుతలేదు

సిన్నబోయి కూకుండనీకి సిరిమల్లె పందిర్లు పాడైనయి
అదేందో నా పుట్క మంచిదిగాదు, బేకార్ పుట్క
నన్నెవరు బుట్టించిండ్రో ఏమోగాని
ఏనాడు కడుపు నిండదిని కండ్లార కునుకుదీయలె
నా గడ్డమీదికొచ్చినోడు సచ్చినా బోడెందుకో

యొడలేని బెల్లంగడ్డలు నా తాన్నే వున్నయా
అదెపాయె, బత్కనియ్యంటే
నన్నే అంగట్ల అమ్ముతుండ్రు తక్కెట్ల జోకుతుండ్రు
నా రూపు రేకల్ని నామరూపాలు లేకుంట నమిలి మింగుతుండ్రు
నా మట్టిల బతికి బట్టగట్టి కోట్లకు కోటలు గడుతుండ్రు

నా జాగ నాగ్గావాలంటె
'ఛత్' నీయయ్య 'విడదీస్తున్నరు' అని
సమైక్య రాగాలు రాజేస్తుండ్రు

గీల్లందర్ని మోసి మోసి మాడంత
కాయగాసిందిరా బిడ్డా!
నా కడుపు నిండ నీళ్లున్నయి,
నా గుండె నిండ గనుల గరిశెలున్నయి
నా నెత్తి నిండ పోరాటాల పొక్కిల్ల తొక్కుడున్నది
అయినా నా వూర్లన్ని వుపాసాలె వుంటన్నయి
గా పెద్ద మనుసులు సావ వాళ్ల నెత్క కట్కపోను
బలిపీటికి బాసింగం గట్టి అడివిల ఆగం జేసింద్రు
'కలిసుంటే కలదు సుకమని' నన్ను కల్లోలం జేసింద్రు
నా బిడ్డలు పిడికెడు బువ్వకు అడివిల అన్నలైతుండ్రు
మస్కట్ తొవ్వల్ల మలిగి పోతుండ్రు

గా పొద్దు నా సెరని యిడిపించనీకి
కొట్లాడిన నా పోరగాండ్లని
పిట్టలోలె కాల్చి సంపితే
గీనాడు కనిపించని కుట్రలు పెట్రోలై హత్యలు జేస్తూ ...
నన్ను సావుల రేవు జేస్తున్నరు
ఎన్నేండ్లున్నా వేరు దప్పది
ఎప్పటికైనా వలస పక్కల బల్లెమై
మేలు కొనే వుంట



వాడెన్నిసార్ల ధోక జేసినా సల్లారని బూడిదిని
వానికి నాలుగు గాదు నలభై తల్కాయలుండొచ్చు

నేను వూరూరికి నినాదమై వురుముతూ
ధూం ధాంతో దిక్కుల్ని దుక్కుదున్నినా
వానికమిటీ తంత్రాల తాయత్తుల్ల కాటగల్సిన
సూరుకు సెక్కిన సుట్టాకునైన
నేను నేనుగా నిలబడందే

ఎల్లి ఎల్లమ్మ, నర్సిగాడు నర్సయ్యలు కారురా బిడ్డలారా
నా పీడలకు పాడెగట్టి నా గడ్డమీద నాకు
బొట్టువెట్టి బోనమండి అస్సోయి దూలాతో
దప్పు సప్పుల్లతో దండోరేసే రోజెన్నడో ...



# దర్గా దయ

యాకూబ్

చాంద్‌మా ... ఏక్‌తార ...
అడవిలో సేదతీరుతూ
జానపాడ్ దర్గాను కాపలా కాస్తున్నట్లు
నా చిన్నప్పుడు మరీ చిన్నప్పుడు చూశాను

తెల తెల వారుతున్నప్పుడు
దర్గా దయకోసం మోకరిల్లిన అన్ని మతాల వారిని చూశాను

ఆకుపచ్చగా ఎగిరే జెండాలు
జెండాలను ఊరేగిస్తూ నడిచే జులూస్‌లు
మన్నత్‌ల్లో మొక్కుకునే మేకపోతులు
మలీదాలు ... తబ్రూఖ్‌లు -
జీవన వ్యథనంతా మూటకట్టి
సేదతీర్చే దయకోసం ఎదురు చూసే శరణార్థుల్ని చూశాను.

జాన్‌పాడ్ దర్గా - జీవన ఆకాంక్షల శిబిరం.
బతుకుగాయాలను మాన్పేందుకు వెలిసిన వైద్యశాల.
కొంచెం జీవన లాలస, మరికొంచెం ధైర్యం
ఇంకెంతో మతాతీతం పంచే దర్గా -
నెలవంకై సేదతీర్చే విసర్గ.



...
నాన్న చెప్పిన కథలు
అమ్మ మొక్కిన మొక్కులు
జాన్‌పాడ్ మా యింటి విశ్వాసపు వింజామర.
కూతురు కావాలని మొక్కుకున్న అమ్మానాన్నల కోరిక
దర్గా తీర్చిందని ...
పీరా కరుణించాడని
ఇల్లంతా సంబరం.
'జాన్ బీ' అని పేరు పెట్టి
బతుకంతా చల్లగుండాలని
మొక్కుకున్న తాదాత్మ్యం.
...
తలలు తెగి యుద్ధం నుంచి
గుర్రాలపై వెనుతిరిగిన మొండేలు
వెనక్కి తిరిగిచూసి
జాన్‌పాడ్‌లో ఆగాయని కథనం.
తెల్లని గుర్రాలు తీరిగ్గా గడ్డిమేస్తున్నట్లు
గతాన్ని నెమరువేసుకుంటున్నట్లు వరుసగా సమాధులు.
త్యాగం - సతత హరితం.
దర్గాలో సమాధులు
వేల లక్షల మొక్కుల్ని అందుకుంటూ
మరణించాక సతతం జీవిస్తూనే వున్నాయి.
...
మతాతీత దర్గాలే వెలిస్తే
గతాలన్నీ సహజీవన గీతాలై విరిస్తే
అప్పుడు మనుషులంతా మారాజులు
బతుకులన్నీ సంక్రాంతులు, రంజాన్‌లు.



# దొరుకకుంటపోంఁడ్రి ...

పొన్నాల బాలయ్య

రాలే చెట్లకు దీటీలు కాత్తే
రాజులు మెచ్చరు !
"అది కచ్చీరు కాపురం"
గుడ్డి కొంగ గురి నాశడగాలానికే!
భాష యాసలు మెడల చెప్పు చీపుర్లై
వాట్ల మొకం మీద బేట్లు లేసినయా?
పాపపు కండ్లు కూల ...!
అంగభంగం జేత్తిరి గదరా!
నెత్తిన సల్ల బాండువా
ఎక్కడికక్కడ పచ్చులు జేత్తిరి
ఏగి లేత్తేనే బరిదెగిన బసికుక్కలా?
అరచేతిల బెల్లం పెడితే
అరునెల్ల గురత్తముండాలే!
గొఁ్ర గొఁ్ర గుంజుకుంట
గోదలోలే కొట్టవడితిరి!
కడుపు కడుక్కున్న ఎడ్డి తల్లి
కండ్ల దుక్కాన్ని కడుపుకద్దుకొని



పదేల పబ్బతి పెట్టి
కాల్లు కడుపులు మొక్కితే
పండిన దొండపండు దేహం!
పొర్లాడే గలుమల నెత్తిన దీపం
తెప్పల సాటు చుక్కల అందేశన!
మనుసు కుదిరితే కడుపు నిండది
మొకం జూత్తే పిల్ల పుట్టది!
ముడిముడికాల కోరికంటవు
ముచ్చటి గుంపుల గుద్ది సంపుతవు!
సాటకు తవుడంటని
కనగంట పుట్టెడేడుపు!
"కట్టెలు వేరైనా కాల్చేది అగ్గే"
కడిగితేనే కయ్యం వొల్లిత్తేనే జవుడం
రగులుతేనే యుద్ధం ...!
నీల్ల మీద దెబ్బతీత్తే నీల్లు బాసిపోతయా!
కొట్టినోని తీటపాసుడే
సూదిని ముల్లేగట్టరాదు ఉద్యమాన్ని ఆపరాదు
మిరుగుల వర్షం ఎగజిమ్మే పొడిసే పొద్దు ఆగది!
ఊర్లన్ని ఉడుకుతున్నయి
ఊర్ల గొలుసులు చిక్కు గొళ్లాలు
ఫల ఫల తెగుతున్నయి!
రాచబాటల గాదు!
దొడ్డిదారిల దొరుకకుంటపోంఁడ్రి ...



# ధోకా!

జూకంటి జగన్నాథం

దీపాలు ఆర్పేటోల్లు
వచ్చింద్రు వచ్చింద్రు
ఊసరవెల్లి రూపాలు మార్చేటోల్లు
వస్తుంద్రు వస్తుంద్రు

తలుపులు కిటికీలు మూసేసినా
మలగకుండా దీపాన్ని
రెండు చేతులా కాపుకాసినా
కుతంత్రంతోని నల్లికుట్ల తనంతోని
దీపాలను ఆర్పేటోల్లు
వచ్చింద్రు వచ్చింద్రు

ఆశ పేర భాష పేర
కడుపుకు కంకెడు బువ్వపేర
ఊసరవెల్లి రూపాలు మార్చేటోల్లు
వస్తుంద్రు వస్తుంద్రు

నిలువు నిస్తారంగా
కొంపలు కూల్చేటోల్లు
ఉన్న పళంగా
కడుపులు కాల్చేటోల్లు



వచ్చింద్రు వచ్చింద్రు
ఇంకా ఏదో ఒక తొంపు పెట్టుకొని
వస్తుంద్రు వస్తుంద్రు

పట్టపగలు
చిమ్మన్ చీకట్లను పంచిపెట్ట
మొట్టమొదలు
చట్టం లోపాలను దంచి కొట్ట
దీపాలను ఆర్పేటోల్లు
వచ్చింద్రు వచ్చింద్రు
ఊసరవెల్లి రంగులు మార్చేటోల్లు
వస్తుంద్రు వస్తుంద్రు

తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్ట
అన్నా! అన్న వరుసల్ని చింపి కొట్ట
ఊర్లకూర్లు చెరపట్టి
తీరొక్క పేరునాలు పెట్టి
నీవు కండ్లు తెరువక ముందే
నిండా ముంచేటోల్లు
నీవు నోరు మెదుపక ముందే
కువారం పట్టేటోల్లు
వచ్చింద్రు వచ్చింద్రు
కాజేసిన కాడికి ఇంకా చాలదని
ముంచ వస్తుంద్రు వస్తుంద్రు

కొలువుల పేర తావుల పేర

ఊర్లే పొద్దు గూకాన్నా అడివిల గూకినట్టు
నడిచే కాళ్లల్ల కట్టె పెట్టినట్టు
చేసే చేతులను ఇరుగొట్టినట్టు
మనసును కాలబెట్టేటోల్లు
వచ్చింద్రు వచ్చింద్రు
ఏ ఎండ కాగొడుగు పట్టి
కండ్లల్లో దుమ్ము కొట్టి
దీపాలను ఆర్పేటోల్లు
వచ్చింద్రు వచ్చింద్రు
ఊసరవెల్లి రూపాలు మార్చేటోల్లు
వస్తుంద్రు వస్తుంద్రు

సొచ్చేదాకా సోమలింగం
సొచ్చినంక రామలింగం
తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టేటోల్లు
వచ్చింద్రు వచ్చింద్రు
వగల మాటలు ఒలకపోసేటోల్లు
నీళ్ల మీదా అగ్గువ బొగ్గు మీద
భూమి మీద బుద్ధి మీద ధోకాతో
బుదగరిచ్చి తినే కూట్లె మన్ను పోసేటోల్లు
వస్తుంద్రు వస్తుంద్రు

కన్ను మూయకుండా కైరత్‌గుండాలి
జంట పాయకుండా మంట రాజెయ్యాలి





# నాటకేషు

దాసరాజు రామారావు

కావ్యేషు నాటకం
రమ్యం ... ...
వెలిసిపోయిన మాట ...

దయనీయం, భయానకం
రాజకీయ గ్రహణోత్సవం
అని పూరించాలేమో
తెరలేచి చాలా కాలమైంది
ఐదేళ్ళ మజిలీలను బొచ్చు కుక్కలా
వెంట తిప్పుకుంటూ
నాటకం మొదలెట్టి,
చాలా కాలమే అయ్యింది

వర్తమాన నాటకానికి
మహోత్తిట్టు లేదా
వాంతొచ్చే పదమేదైనా పెట్టుకోవచ్చు

క్రికెట్టంతా
చాణక్య చేతిలోని
చిత్రగుప్తుని గంటంతో
రాసినట్టే వుంటుంది
వేటు వేసినా
కోటను దోచినా
చట్టం దేవతకు నమస్కరించే -

భారీ డైలాగుల ముందు కంటి చూపులే పోటీ?
పదవుల నోట్లోంచి, జర్రున జారిపడి
మీడియా ముంగిట
సిగ్గులేని మొహంతో తేలడం -
సాయంత్రమయ్యేసరికి
ఒళ్ళే సరాగాలై వాలే పబ్‌ల మీదుగా
తలాపుకు వేలాడే వేటకొడవళ్ళ
మీదుగా
కటాక్షించే తారక మంత్ర ముక్తి
పదమ్ముల మీదుగా
బ్యాగ్రౌండ్ మ్యూజిక్ పీనులను
కుద్తూ వుంటది

పాత్రలన్నీ అరచేతి క్షేత్రం లోనే
గుండ్రంగా తిరుగుతయి
జల నురుగల్లో
మేఘ మథన మాలికల్లో
"వలయు చోట కావలయు"నట్లుండే

హోం క్రీ నీడల్లో
రూపాయి రాకడ పోకడల్లో
సందు జూసి వాతలు గుంజే
ధర్మ సూక్ష్మాల పల్లవిలో
మరొక్క వెలుగు వెలిగేటందుకు
వేదిక సిద్ధమైంది

సన్నివేశాలన్నీ
బడా వామనుడి మాయోపాయ పాదచ్ఛాయల
కింద
పీలికలుగా చెదిరిపోతున్న
దృశ్య పరంపరలే
అంకములు, ఎపిసోడ్లు
ఫాస్ట్, రివైండ్ మెథడ్‌లో ఫిక్సై
తెరపైన ఒకే బొమ్మ కదుల్తూ
రాజసంగా, భస్మాసుర హస్తం
గాల్లో వూగుతూ
ముద్దుల కాట్లు విసురుతూ -

జ్యోతి ప్రజ్వలనంలో
చమురింకిపోయినంక
దీపం మాడి, నల్లని వత్తై
ఆకలి మిగిలినంక
దుమ్ము దులుపుకుని
అంతా లేచే వేళకి
తాళాలు గొట్టుకుంటూ

వందిమాగధులు భరతవాక్యం
పాడుతుండగా
చివరి హస్తాక్షరాల మెరుపుల
రాజముద్ర సంతకం పూర్తయితది

శూన్యావరణాన్ని సూచిస్తూ
తెరజారుతుండగా
గుమ్మం కూలిన ఇంటివైపు
మరలుతూ

కడుపుబ్బ నవ్వుకుంటవో
కంటినిండ ఏడ్చుకుంటవో

ప్రేక్షకా ...
        ఓటుని వజ్రాయుధమని
                నమ్మినందులకు -





# నిదురరాదు

ఇ. వెంకటేష్

నిదురరాదు ...
కళ్లలో నిదుర కుక్కుకున్నా నిదుర రాదు.
తరతరాల అవమానాలకు సమాధానం చెప్పనిదే
నిదురరాదు ...

తడి ఆరని నా గతం
నెరవేరని అస్పృశ్యత కలల మధ్య
బహుళజాతీ కంపెనీల రోడ్లపై
నిరుద్యోగపు నాబోడి మొహంపై
నిదానంగా ఓదార్పును స్ఖలిస్తుంది?

ఒకప్పుడు వాడు కవిత్వం రాసి
'భళా' అనిపించుకున్నాడు
ఇప్పుడు గిట్టుబాటుకాదని
లాభనష్టాల బేరీజు వేసి
కంప్యూటర్‌కు "కనెక్ట్" అయ్యాడు!

ఇంగ్లీషుతో వాడు రమిస్తున్నప్పుడు
తెలుగు తల్లిని కవిత్వాభిషేకం చేశాము
డాలర్ల వేటలో అమెరికా వాడి అత్తగారి ఊరైనపుడు

ఎమ్మే తెలుగుతో కడుపు నిండక
కవిత్వాన్ని మొలకెత్తించి
నల్లటి అక్షరాలతో
చరిత్ర చెక్కిళ్లపై
ఆకలి ముద్దలవుతున్నాం!
ఎంతైనా వాడు తెలివైన వాడే!
తిండి పెట్టని చదువులకు రిజర్వేషన్ కల్పించి
వాడి బంగారు భవిష్యత్‌కు మేము పోటీకి రాకుండా
ముందుగానే రిజర్వేషన్ చేయించుకున్నాడూ!

ఇప్పుడు చేయాల్సింది ఆఖరి పోరాటం
సవ్యసాచిలా యుద్ధతంత్రాన్ని ప్రదర్శించాల్సిందే
ఒకవైపు ఆత్మహత్యల తెలంగాణ
మరోవైపు నల్లని రంగుకొస్తున్న కవిత్వ సుందరి!

చివరకు పద్మవ్యూహంలో చిక్కుకున్న
అభిమన్యుని మాదిరి
దిక్కుతోచని రహదారి నాగుపాములు
కనిపిస్తే కాటేసే మదపుటేనుగులు!

డార్విన్ ఎంతటి మూర్ఖుడివయ్యా!
చిన్నప్పుడు నీ "పరిణామ సిద్ధాంతం" చదివి
మురిసిపోయాను. కానీ .. .. ...
కొన్నివేల శతాబ్దాలుగా నానుదిటిపై
అతికించబడిన
ఒక పురాతన చిహ్నం అలాగే వుంది!
ఎలాంటి మార్పులేకుండా ... ... ...





౨

# నిరింద్రియం

అయిల సైదాచారి

ఇంద్రియాలతో సుఖించి
ఇంద్రియాల్ని నమ్ముకున్నందుకు దుఃఖించి
నా చిత్రాన్ని నేనే గీసుకుని, రంగుల్ని పులుముకుని
చూసిన దృశ్యాల్నీ, వాసనల్నీ
అనుభవించిన స్పర్శల్నీ
విన్న సంగీతాల్నీ
నాలుకమీద నలిగిన రుచుల్నీ
అన్నీ రద్దు చేసుకుని -
            దేహంతో మొదలైన ప్రయాణం
            దేహంతో అంతమవుతుంది
మృత్యువు నాపక్కనున్నప్పుడు
తినటమో, తాగటమో
అట్లాంటి మరే యింద్రియ సుఖానికో
            చేతులడ్డం పెట్టుకుంటాను
ఆరోగ్యం కోసం పత్యంలాగా
దింపుడుగళ్ళం దగ్గర శ్మశాన వైరాగ్యం
            మృత్యువు ముందు నమ్రత అంతా
            నటనా, భయమూ -
ఏమి ఉన్నచోటికొచ్చానో
వాటితోనే నేనుండాలి

కోళ్ళనీ, మేకల్నీ, ఆవుల్నీ, పందుల్నీ

తింటానో, పూజిస్తానో
పూల పరిమళాల్నీ, మలిన దుర్గంధాల్నీ
భరిస్తానో, ఆఘ్రాణిస్తానో
రూపాల్నీ, కురపాల్నీ
ద్వేషిస్తానో, స్పర్శిస్తానో
స్వరాలూ, అపస్వరాలూ
కర్ణపేయమో, కర్ణహేయమో
అవలయనో, లయజ్ఞానినో
దేహంతో అంతమైన జ్ఞానం
దేహాంతంలో మొదలౌతుంది

ఈ ముఖాన్ని యిట్లే ఉంచుకోవాలి
ఆత్మా మనస్సూ లాంటి మర్మాంగాల్ని - యిట్లే కాపాడుకోవాలి
కలల్ని యిస్తున్న జీవితమున్నది
మరచిపోతున్న కలల్ని గుర్తుచేస్తున్న స్త్రీలు ఉన్నారు
తనకుతనే వెలుగుతున్న దీపం చుట్టూ
స్వతంత్రాన్ని హరిస్తున్న కాంక్షాపూరిత తేజస్సున్నది
ఉపశమనం మృత్యువు
హాయి మృత్యువు

ఉపసంహారం :
కవిత్వోపాసనా, సౌందర్యశోధనా జీవితం
కవిత్వీకరించటం, స్ఖలించటం
రెండూ మృత్యువు -





# నువ్విప్పుడు నా భూమివి

షాజహానా

నీ శ్వాసను అత్తరులా పూసుకుని జీవిస్తున్నాను
నా భూమి మీది ప్రేమలా నీ మీది ప్రేమను మర్చిపోలేకపోతున్నాను
నా నేలమీది మట్టి గంధాన్ని రాసుకున్న
క్షణాన్నే ఉద్యమం ఊపిరి పోసుకుంటుంది
నా దేహం నిండా ప్రవహిస్తున్నది రక్తం కాదు
నా ప్రాంతపు ఊపిరులే

ఎవరో నా ప్రేమను నా నుంచి లాక్కుంటున్నారు
ఎంత క్రూరులై ఉంటారు
దక్షిణాఫ్రికా గూడెం ప్రజలను ఎత్తుకుపోయినట్లు
నా ప్రేమను హైజాక్ చేస్తున్నారు ...
నిన్ను అమితంగా నా ప్రాణంకన్నా మిన్నగా ప్రేమిస్తున్నందుకుగాను
హిట్లర్లయ్యి నా ప్రేమికను నా నుంచి లాగేసుకుందామని చూస్తున్నారు
చూడు వేల ప్రేమికులు యూనివర్సిటీల నిండా
లాఠీల కింద విరిగింది దేహమా ... ఈ నేల కాదూ ...
ప్రవహిస్తున్నది రక్తమా ...
ఇన్నాళ్ల లోపల్లోపల తెర్లుతున్న నా ప్రాంతపు నీళ్ల కాదూ ...
వీళ్లంతా నా ప్రాంతపు చంఘీజ్‌ఖాన్‌లు, స్పార్టకస్‌లు, చేగువేరాలే

తల్లులంతా తమ కొడుకులను
బంగారు గాజులు తీసి జోలెలో వేసినంత ఉద్యమం వడికి ఇచ్చేస్తున్నారు
మీ కొంగులను కళ్లకు గంతలు కట్టుకోకండి
మీ కలాలను శాలువాల కింద దాచేసుకోకండి
అవి కూడా మిమ్మల్ని ఏకాంతంలో ప్రశ్నిస్తాయి
కవన్నోడు స్వేచ్ఛకు చేయుందించాలి కదా అని
ఎంతో దుఃఖంగా ఉంది ... కానీ తీయుగా ఉంది
ఎంతో బాధగా ఉంది ... కానీ భరించాలని ఉంది
ఎంతో ఉక్రోషంగా ఉంది ... కానీ పోరాటం నరాలు తెంచుతోంది
నా నిరాహార దీక్ష నా ప్రేమను గెలిపించేంత శక్తివంతంగా ఉంది
ఎప్పుడయినా నా ప్రాంతపు మట్టిని రుచి చూశారా
నా ప్రేమికుడు నాకిచ్చిన తొలిముద్దులా ఉంటుంది

నేను వేరు నా నేల వేరు కాదిపుడు
నా తల్లిదండ్రి నీరు నిప్పు ఆఖరికి
నేను కూడా వేరు కాదు - నా ప్రాంతమే
నువ్వు నా దేహంలో భాగమయితే కని పక్కన పెట్టేదాన్ని
కానీ ప్రేమికా! నువ్విప్పుడు నా ఆత్మలో భాగానివి
నా భూమివి ...!





# పదవి

అన్నవరం దేవేందర్

గల గల నదుల నిండా నీళ్ళ దోప్కం
ముల్లె మూటల మీన్నే మా నిగురాన్

పేదసాదల బతుకులు ఆకలి నకనకలు
పెరిగిన బొర్రలు తీడుకుంట మేముంటం
టబ్బులకు టబ్బులు బొగ్గు ఆవలి గడ్డకు
మేమైతే బొగ్గువల్ల తిని ఇగిలిత్తన్నం

మనోల్ల కొలువులల్ల మన్ను దుబ్బ
మోచేతికింది నీళ్ళు తాగుతు నిత్తె కుషామతుగున్నం

నాలుగు పానాదుదల కాడ భూమి జాగ పలారం
మారు మాట్లాడకుండ నోటి నిండ బెల్లంగడ్డ

అంబాడిన నేల ఇచ్చుకపోతేంది
అందలం ఎక్కి అందిన కాడికి మేత అందుకుంటం

బడిపోరలు నిత్తె సత్తె ఎంది
బంద్‌లు ధర్నాలు ఎంత జరుగుతేంది
ఏర్పడకుంటనే ఏడుస్తం ఎగురుతం
ఆడిచ్చినట్టు ఆడుతం పలుకు మన్నట్టు పలుకుతం
వండుమంటె వంటం లెమ్మంటే లేస్తం

ఊరు వాడ ఎద్దు ఎవుసం పల్లె ప్రాంతం
వీటన్నిటి కన్నా
పదవి పైన సొమ్ము సామందం బహు మిన్న





ప

# పహారా హుషార్

రామా చంద్రమౌళి

నిప్పు నివురు దుప్పటిని కప్పుకుంది
ఎక్కడో లోలోపల సలసల మరిగే లావా
చూపులుకొన్ని పిడుగుల తోడుకోసం ఆకాశంలోకి చొచ్చుకుపోతున్నాయి
ఎదురుగా ఒక ఖాళీ ఉద్యమ గుడారం
మూసుకున్న కళ్ళ వెనుక
రక్తాలోడ్తున్న శరీరాలు, నరాలు చిట్లిపోయే రణ నినాదాలు
మందలు మందలుగా అడుగుల మరఫిరంగి చప్పుడు
ఉండి ఉండి ఎక్కడో తుపాకీ పేలిన ధ్వని
గుంపులు గుంపులుగా పక్షుల రెక్కల చప్పుడు
మనిషి ఎదుట దృఢంగా నిలబడి గల్లాపట్టి గర్జిస్తున్నట్టు
విశ్వవిద్యాలయ గుండెపై నిశ్శబ్దంగా మర్రిచెట్టు,
ఎక్కడో ఏదో జరుగుతోంది ...
ఎక్కడో ఏదో దారితప్పుతోంది ....
గాలిపటం గిరికీలు కొడ్తోంది ... మాంజా కావాలి
ఇప్పుడు అత్యవసరంగా పిడికెడు నిప్పుకావాలి
మనుషులు ... అంటుకున్న అడవిలా కలిసి ఎగిసి అగ్గి సముద్రమైనవాళ్ళు ఏరి ...
ఎవని డెన్‌లోకి వాడు, కుమ్మరి పురుగుల్లా మాయమై
తెగిన చెప్పులు, నిశ్శబ్దంగా కాల్తున్న రబ్బరు టైర్లు
చుట్టూ కమురు వాసన
మనుషులు పరిగెత్తిన పాదముద్రలు
రక్తపు మరకలు ... చిరిగిన అంగీలు ... కన్నీళ్ల చినుకులు
ఎక్కడో ... ఏదో జరుగకూడనిది జరుగుతోంది

నిన్నటి దాకా నిప్పుల ఉప్పెనైన పాట
ఎక్కడో గాలిలో గడ్డకట్టిపోయింది
గజ్జెలు ... పాదాలను వదిలాక ... ఏమౌతాయి
చెల్లాచెదురు ...
మనిషి ఎక్కడో అదృశ్యంగా పొంచి పొంచి
ఇంటి దొంగై ... ఇంట్లోనే దొంగై ...
కోవర్ట్ శత్రువుకన్నా ప్రమాదకారిగదా
వ్యూహాత్మక మౌనం చేయగలిగేది హత్యే ఐనపుడు
పెట్రోల్ మంటలతో విప్లవిస్తూ పరుగెత్తే దేహాలు
ప్రతిజ్ఞలు, ప్రమాణాలు ... కత్తుల్లా చాచిన చేతులు ...
చటుక్కున ఏదో చిట్లింది
మాట తప్పడానికీ, అబద్ధమాడటానికీ నడుమ సన్నని గీత
ఏమిటి ... ఏమిటది ... ?
చురకత్తితో ఎవడో కడుపులో కుమ్ముతూ ధ్వంసిస్తున్నపుడు
అవనతమౌతున్న ఆకాశం ఆశీర్వదిస్తోందా ... కబళిస్తోందా,
శరీరంలోని జీవకణాలే శల్యునివలె హసిస్తున్నపుడు
పహరా హుషార్
మళ్ళీ ఒక హత్య జరుగబోతోంది ...
మౌనమంటే కుట్ర, మౌనమంటే కుతంత్రం, మౌనమంటే రహస్య ఎజెండా
అంతా ... ఉక్కపోత ... వడగాలి ... దుబ్బ ... దుఃఖం ... కన్నీటి పలకరింత -
ఐనా ... అదిగదిగో
బూడిదలో నుండి నిప్పుపక్షి ... ఫీనిక్స్ -





21

# బహుచేతనం

కందుకూరి దుర్గాప్రసాద్

మొక్కకు తీసిన పాదు ...
గుబాళిస్తున్న పద్యమంత అందంగా ఉంది

ఎడారి గుండె మీద ...
మరస్వప్నమో ... తామర స్వప్నమో
అంతరాత్మ నవ్వి ఊరుకుంది ...!
పచ్చదనానికి వేసిన శిలువలా ...
మొక్క నిలబడుంది !!

నీళ్ళు పోయలేని ...
నా నిస్సహాయతను తనే మోస్తూ ...
పత్రనేత్రాల్ని వాల్చుకుంది!

అనిపిస్తుంది ...
భూమిలోంచి సరే ...!
ఉబుకుతున్న నరాల్లోంచైనా ...
నీరు తీయలేని వాడు ...
జలశోధకుడవుతాడా అని ..!

నాకు తెలియదు ...
మనిషి కన్నీరు
మొక్క కోసం ...
రాత్రి నీటి చినుకవుతుందని!
నేల కోసం
ఎగసే నెత్తుటి తరగ అవుతుందని!!
మొక్క ఇప్పుడు చిగురేస్తుంది ...
పూలు పూస్తుంది ...!
అమరత్వానికి ...
రోజా ఒక రూపాన్నిస్తుంది

నాకు పొద్దున్నే లేచి ...
సూర్యున్ని చూడడమైనా ...
అమరుడైన ...
వీరున్ని చూడడమైనా ఒకటే
గుబాళించే పద్యమంత అందంగా ...
మొక్కకు పాదులు తీసాను ...

ఎడారి గుండెల మీద తామర స్వప్నం
అంతరాత్మ నవ్వి ఊరుకుంది!
పచ్చదనానికి వేసిన శిలువలా ...
మొక్క నిలబడి ఉంది !!

నీళ్ళు పోయలేని నా నిస్సహాయతను ...
తనే మోస్తూ పత్రనేత్రాల్ని వాల్చేసుకుంటుంది!



నాకనిపిస్తుంది ...!
భూమిలోంచి సరే ...
నెత్తురులోంచి నీరు తీయలేనివాడు ...
జలశోధకుడవుతాడా అని!!

నాకు తెలియదు ...!
మనిషి కన్నీరు
మొక్కకోసం
రాలే నీటి చినుకవుతుందని ...!
నేలకోసం ...
ఎగసే నెత్తుటి కెరటం అవుతుందని
ఇప్పుడు మొక్క చిగుర్లేస్తుంది
పూలు పూస్తుంది ...
రోజా అమరత్వానికి ఒక రూపాన్నిస్తుంది ...
నాకు పొద్దునే లేచి
సూర్యున్ని చూడడమైనా ...
అమరుడైన ...
వీరున్ని చూడడమైనా ఒకటే



# బుగులు

సిద్ధార్థ

గంధక ధూపం నీ నిశ్శబ్దం
గన్నేరు వనాల నిద్ర ... కల
తాటి నేలల్లో తత్త్వ విచారం
            వాక్య సంచారం
ఇదంతా సాధ్యమేనా ... ఈ బతుకున
            అనుకుంటే ఎట్ల చెప్పు
ఇది నిజం ... మరణమంత వాస్తవం
నీతోని నడిచి చెప్పిన మాటలన్నీ .. ఆటలే ...
            కవిత్వపు జాడలే ...
నీ తోని పంచుకున్న నీడ సమస్తం
            వొక అత్యధిక వాస్తవ సౌందర్యం
కాలాన్ని ... నాలుక కొసకు వేలాడదీస్తున్నాను
కోపాన్ని బొడ్డు చుట్టు పేగులాగ
            చుట్టుకున్నాను
            స్పర్శ కోసం రక్తస్రావమైనాను
            పక్క కోసం చీకటిని తాగాను
            వాక్కు కోసం ... మౌనానికి తూటానై
            తగిలాను

రాలే ... ఆకులు
కూలే ... అడుగులు
చెప్పే ... చివరి జాగ్రత్తలు



అన్నీ నీవైపు నుంచే అనుకున్నాను
రైలు గంట మోగినపుడైనా ...
            నువ్వు ఆగమాగంగా వస్తావని చూసాను
ప్రాంతమంతా నెత్తుటిలో ... దూలాడినపుడైనా ..
            మాట ఇస్తావని నమ్మాను ...

... ... ... ...

            కూలిపోయాను అసంగతంగా
            కాలిపోతున్నాను ...
నేను నీ తర్కంలో కూరుకుపోయిన
            వానకాలాన్ని
మోసంలో ... పక్కటెముకలు విరుచుకుంటున్న
            పంటపొలాన్ని
ఎంత రాని చినుకు
            ఎన్ని మాటలైనా చెబుతుంది
నేను నెర్రెలీనే దాకా
            కాలం కాటేస్తూనే వుంది
నేను కంది విరిగిపోయేదాకా
            వడగాలి కౌగిలించుకుంటూనే వుంది

మన ఇద్దరి సోపతిలో
కతలేదు
తీయని వెత అంతకన్నా లేదు
వొక నిర్విరామ సంచారిణి ...
ఎదలో వుండు
ఏదేదీ లేదు
ఇంకేదీ మిగలదు



# మెహబూబ్ (నగర్)

కొల్లాపురం విమల

నక్షత్రాల వరుసల వీక్షణా
విభ్రమణం
లో ... లో ...
మతిదప్పి వెర్రిదాన్నై
మోయలేని బరువుతో
వేదనపడుతుంటే -

నా కన్నీళ్ళ తాగి
దూపలు తీర్చుకునే బాటసారివై
నాలోని ఆత్మిక ఫలాలను
అనుభవించి -

నన్ను బిచ్చెగత్తెను చేసావ్
బష్టుదాన్నైతి
నీకు

పాల్దాగి పగలు
దీర్చుకుంటవని
తెలిసీ

రొమ్ముందించిన

బిక్షుక స్నేను
మాతమ్మను

వశంగాదెవ్వర్కి
ఇగ ఉగ్రమెత్తింది
నాకు



# మీవోన్ని ఒక మాటంట ...

అంబటి వెంకన్న

యాసభాషలు జాడ అవమానమేనా
విద్యా ఉద్యోగాలలో తెర్లయితున్నదాన
నీల్లు నిప్పులై
నిధులు అప్పులై అల్లాడుతున్నదాన
భూములన్ని పోయి బుగ్గి పాలైతున్నదాన
కూటికొరకు కోటి తిప్పలు బడుతున్నదాన...
రజాకార్ల రక్తాన్ని తాగినవ్
నిజామోని గోరి గట్టినవ్
దొరలూ భూస్వాముల నెదిరించి గెలిసినవ్
బడుగు బలహీనుల్ని బరిసెలుగ మార్చినవ్
కొమరం భీము ఐలమ్మలను గన్నవ్
ఓయమ్మా నా తెలంగాణ
మముగన్న మా తల్లి మా తెలంగాణ

లేస్తినంటే నేను మనిషినే కానంటు
ఎములాడ రాజన్న ఏశమైతనంటు
కొమురెల్లి మల్లన్న మీసమైతనంటు
సమ్మక్క సారక్క శౌర్యముందంటూ



ఉగ్రరూపం దాల్చే యాదగిరి నర్సన్ననంటు
పాటల్ల జెప్పినం మాటల్ల జెప్పినం
పనిమీది కొస్తాలికె పక్క దులిపేసినం
సేనుబొయినా గాని సెలుక బోయినాగాని
గజ్జెలు గజ్జెలని గజ్జెగట్టాడినం
తెలంగాణ పాటంటె ఆడేటి సినిమాయె
వినిచూసి మురువంగ మరిసిపాయినట్టాయె
ఏడేండ్ల పొద్దాయె ... ఏ మార్పు రాదాయే ...
ఎనకటిసంది జూడా ...
ఎక్కడేసిన గొంగడి అక్కడే ఉన్నట్టు
అంతకంతకు బతుకు దిగజారిపోయినట్టు
అదిరిపోయి మనము వెనుదిరుగుతున్నట్టు
అనిపిస్తే అరికాలు దుమ్మొగిరిపోతుందీ ...
ఓయమ్మా నా తెలంగాణ ఏమాయె నీ పౌరుషం

పైస పదవికి లొంగి పౌరుషం కుదబెట్టి
కన్నతల్లి గుండె ప్రియురాలికియ్యంగ
అభివృద్ధి ఆటాడి అన్ని మరిసేరు
వలసాంధ్ర పాలకులను వంగొంగి మొక్కేరు
ఓయమ్మా నా తెలంగాణ ... ఏమాయె నీ పౌరుషం
ఎవడు తాకట్టు బెడుతుండో కనికట్టు జేస్తుండో
ఎవరెవరు ఏ పాట ఏడేడ బాడ్తుండ్రో
ఎవరెవరు ఏ పూట ఏ ఏశమేస్తుండ్రో
చీకట్ల ఏముందో పగలేమి జరిగిందో ...
కనిపెట్ట లేనంత ఎర్రిదానివి గావు
కసిరియ్య లేనంత చిన్నదానివి గావు

కన్నకొడుకైనను కాని పని జేస్తుంటే
కుతిక బిసికి సంపె మొండిదానివి నువ్వు
ఓయమ్మో నా తెలంగాణ
వీరుల త్యాగాల ధరణీ ...

భూ తల్లిని మించిన సహనమున్నదాన
పగవానికి సైతం పాలిచ్చెదానా ...
మోసమె చేసింద్రు మొదగాలు నిజమే
మోసపోయిన మాట నిజమే, నిజమే
మోసగాడని వాడు తెలిసినంక మనకు
మోసపోవుట ఇప్పుడెవరి తప్పూ
ఇంకా ... మోసపోవుట
        ఎవరి తెలివిదక్కువ తనమూ
ఇంకా ... దోపిడీకి గురికావడం
        ఎవరి వీరత్వానికి గుర్తూ
ఇంకా ... బతిలాడటమూ ఎవరి చేతగాని తనమూ
ఓయమ్మో నా తెలంగాణ వీరుల త్యాగాల ధరణీ ...

మా భూములు మాయేనని భూములాపలేదు
మా నీళ్లు మాకేనని నీళ్లు దాపలేదు
మా బొగ్గు మాకేనని బొగ్గునాపలేదు

ఆరొందల పది జీవో అమలు జేయించలేదు
అక్రమ ప్రాజెక్టు కట్టడాలను ఆపింది లేదు
అడుగడుగునా మనకు అవమానం దప్పలేదు ...



ఇగనన్న మనమంతా పార్టీలను పంతాలను వీడి
ముసలోల్లు ముడిగోల్లు ఆడోల్లు మొగోల్లు
పిల్లలూ పెద్దలూ అందరొక్కట్టై
రాజస్థాన్ గుజ్జర్ల లెక్క
పట్టుబడితె తప్ప పనిగాదు బిడ్డా ...
ఓ పౌరుషాల తెలంగాణ బిడ్డా ...

అదును మించిపోతే
అమ్మ అన్నారాదు ... అయ్య అన్నా రాదు ...
ముంతెడు నీళ్లకు మురిసి
వొచ్చెడు నీళ్లని ఆగం జేయకురి బిడ్డా



# యాభయ్యేళ్ల యాతన

ఎలనాగ

కల తలక్రిందులైతే కలిగేది దుఃఖమే
తోట కాలిన దృశ్యం లోంచి
తొంగిచూసేది మోడువారిన హృదయ చిత్రమే
ఒక మెరిసే స్వప్న వైడూర్యాన్ని పొదిగిన
సొంత కుటీరం కోసం
వదలిన పీడితాంతరంగాల మీద
వసంతాలు పరుచుకునే మధుర క్షణం కోసం
యాభయ్యేళ్ల ఆరాటంతో
యాతన పడుతున్నానంటే
క్షోభ ముసిరిన ఈ అంతరింద్రియాల్లో
ఎంత వేడిమి నిండి వుందో ఎరుగలేవా నువ్వు?!

పాదం మోపిన భూమిని
పందేరం కోసం చాపలా లాగేసి
పొలాల పొడి నాల్కల మీద తుళ్లింతలయ్యే
జలాల చైతన్యపుటలల్ని దారి మళ్లించి
నేలతల్లి బిడ్డల బ్రతుకుదెరువును
కాలరాస్తూ పెట్టిన ఎసరు
కంటకధామాలుగా మార్చింది ఇక్కడి ఇంటింటినీ -





నోటికాడి ముద్దకు రెక్కలు మొలిచి
వెక్కిళ్లను మేం మూటగట్టుకోవడం
నీ లెక్కలోకి రాదనుకుంటా

చీమల బారులు చేసిన చి(త్రా)ద్రాలకు
స్థానిక బ్రతుకులలోపలి
సస్యశ్యామలత పరారు!

మానని గాయాల మీద మాటల కారాన్ని చల్లటం
రోజుకో నిప్పుల కుంపటి రాజేస్తూ
గోడమీది పిల్లిని సైతం సిగ్గిల్లజేయటం
ఇలా సాగినందుకే కదా
ఇలాకాలుగా విడిపోవాలనటం

పొసగని స్నేహ సంబంధానికి
ముసుగేసి వుంచటం ఇంకెన్నేళ్లు?
దోసకాయకు చుట్టిన ఇనుపకట్టు
కుదురుగా వుండగలిగేది ఎన్నాళ్లు?

అందుకే ...
పచ్చని కల పరితాపపు చిచ్చులో దగ్ధమవ్వక ముందే
తోట పూర్తిగా మాడి పాట రాలిపోక ముందే
రెండు వసంత కావ్యాశ్వాసాలుగా
పరిచ్ఛేదమొందటమే పరమోత్తమం కదా!



# వాళ్ళు మేము

సుంకిరెడ్డి నారాయణరెడ్డి

గాలి వీస్తున్నది
పండుటాకులు పడిపోవాలెగాని
పుప్పొడులు రాలుతున్నవి
ప్రవాహం ప్రళయమవుతున్నది
ముసలి వృక్షాలు మట్టిల కలవాలె
కాని
గరక పోసలు అవిసిపోతున్నవి

...

అక్కడి పిల్లలు 'అమ్మాయిల' వళ్లో తలదూర్చుతుంటే
మా పిల్లలు మృత్యువుకు తలలప్పగిస్తున్నరు
వాళ్ళు ఉల్లాసాల్లో కేరింతలవుతుంటే
వీళ్ళు ఈ నేల వేదనల్లో హోరెత్తుతున్నరు
అక్కడ యాసిడ్‌లై వికృతమవుతున్నదౌష్ట్యం
ఇక్కడ దేహాలు దివిటీలవుతున్నత్యాగం
స్వార్థంలో 'పోటీ పరీక్ష'లవుతున్నారు వాళ్లు
నిస్వార్థ పరీక్షల్లో పోటీలవుతున్న వీళ్ళు

...

వింటున్నావా కృష్ణవేణీ
ఇద్దరి మధ్య పెద్దక్కా
వేలాది చేతుల్ని నరుక్కున్నవాళ్ళం
మున్నూట డెబ్బయి శిరసుల్ని ఖండించుకున్న వాళ్లం
దీక్ష సడలలేదు
కన్నప్పల్లా మా పిల్లలు కండ్లు పెరుక్కుంటున్నరు

★

కఫన్ తెలంగాణై రెపరెపలాడాలని వీళ్లు
అదే గుడ్డ ఎజెండా కావాలని వాళ్లు
వీళ్లు తల్లి కోసం పడి'చస్తున్న'రు
పదవులకోసం 'పడిచస్తున్నరు' వాళ్లు

★

వింటున్నావా?
తప్పని అగడ్డై ఆదుకున్నదానివి
వాళ్ళది రక్తదాహ చరిత్ర
మాది రక్త తర్పణ చరిత్ర
తెల్లోళ్లలా ఆక్రమణ చరిత్ర వారిది
సమ్మక్కలా ధిక్కార చరిత్ర మాది
జర వాళ్ళకు చెప్పు
మాది కడుపు మంట అని చెప్పు
వారిది నోట్ల కట్టల కళ్ళమంట అని చెప్పు
మాది అందరి ఆవేదన అని చెప్పు
వారిది కొందరి అహంకారం అని చెప్పు
రాలిపోయిన మా ప్రతి మొగ్గకూ
కారణం అదే అని చెప్పు

★

ప్రాణం తృణప్రాయమని వీళ్ళు
పదవీ తృణమే ప్రాణమని వాళ్ళు

★

విను తల్లీ
మా ప్రతి ఒక్క వూపిరి మంత్రిస్తున్నది
ఒక్కటే జపం ఈ నేల మాదేనని
తడిలేని వారి పెదవి పెట్టుబడి అని కలవరిస్తున్నది
గాయం మాది
వీధి, వాడ గోడ గానమై కదులుతున్నది
గాయంలేని వాడికి గానమెక్కడిది

★

చీకట్లోకి మాయమై
విద్యాలయాల్లో వీధుల చౌరస్తాల్లో
వెలుగులు నింపుతున్నరు
మా శ్రీకాంతులు

నాయినా బిడ్డలారా
మా కాలిగజ్జెలై కదంతొక్కాలెగాని
పగిలిపోయిన పెంకలౌతారా?
మా పాటల్లో పదాలై ఒదగాలెగాని
తెగిపడ్డ తంత్రులవుతారా?

అఖరిసారి ఇది గూడ చెప్పుతల్లీ
ఆత్మక్షోభే కాదు
ఆత్మ విస్ఫోటనమూ జరుగుతుందని చెప్పు.





౨

# విద్రోహాల అంచుమీద

వఝల శివకుమార్

ఇప్పుడాల్లకి నమ్మగుంది
గోతికాడి నక్కల ఎదురుసూపులకు
ఫలితం దక్కింది
మనం కుక్కల్లా కాట్లాడుకుంటే
వాళ్ళకు సుక్కతలకెక్కినంత హాయి

నిల్చున్న కొమ్మ నరుక్కుంటూ
ఇగురం తప్పిన మతి
ఇంగితం మర్సింది
ఇరుసుజారిన గీరలు తలోదిక్కై
బండినొగలు జారవిడిచినై

ఒక్క మొగురం కింద మొన అయ్యి
బతికేటోల్లం
వాసాల కోసం గీసులాడుకొని
ఇల్లిప్పుకుందామా?

కడుపు చించుకొని
కాల్లమీద పడేసుకున్నంక
పజీత ఆరుపార్లైపాయె

బునియాదులకోసం
ఆగమైన పానాల గావరల సొచ్చిగా
మరోచరిత్ర ద్రోహానికి మనమే
కాళ్ళు దువ్వుకుంటున్నం
నోళ్ళు రువ్వుకుంటున్నం
వాళ్ళకిప్పుడు మన మాటగారడైంది
మనపాట పారడైంది

వాళ్ళ రంకుబొంకుల రాజనీతి ముందు
మన బతుకిప్పుడు
బరిబాతల నాట్యమైంది
ఒకడుతొడ చూపిత్తుంటే
మరోడు వొడిచూపిత్తాండు
చేవ చచ్చి అమ్ముడుపోయిన
కొడుకుల ముందు
తెలంగాణ తల్లి ఆడవి దుఃఖమైంది

నమ్ముకునుడుకూ అమ్ముకునుడుకూ
తేడాతెల్వినోల్లం
నియతిమీద నిలవడి
బేనియతుల ఇజ్జతు దియ్యాల్సినోల్లం
మరోబానిసత్వానికి



ఖరారు నామాలెందుకురాస్తున్నం?
ఇంకా ఎందుకు ఆగమైతున్నం?
ఓ మాటగాడా!
ఓ పాటగాడా!
ఓ ఆటగాడా!
ఒక రాగంలో భాగం కావల్సిన మనం
వేరు స్థావరాలనించి
కత్తులు దూసుకోవటం
వాళ్ళ కానందం కలిగించే క్రీడ
మన పోరాటానికి పడుతున్న చీడ
మన తల్లి మనుగడకి పట్టిన పీడ

మనం ఇల్లెక్కిపాడుకుంటున్న
ఇంటి పంచాయితి
బయటోడికి పరాచికాల ఆటైంది
తుపాకిరాముడి తూటా అయ్యింది

ఒంటిచూపు చర్చల మధ్య
చూపులమ్ముకున్న సర్వేల మధ్య
మీడియాల ఐడియాల మధ్య
రాజకీయాల మధ్య న్యాయస్థానాల మధ్య
విద్రోహాల అంచుల మీద
మన అస్తిత్వ పోరాటాలు అవిటివై పోతున్నాయి
మన వ్యక్తిత్వాలు మార్కెట్ సరుకులైపోతున్నాయి
మన జనం గుండెలు బదాబదలైపోతున్నాయి

కళ్ళు మనవే ... వేళ్ళూ మనవే
రా రూపుమారుతున్న నడకకి
మళ్ళీ చూపునిద్దాం
చూపు కోల్పోతున్న కళ్ళలోకి
దివిటీల ప్రవాహమై దూసుకొద్దాం

రా మనపాపాలు మనమే కడుక్కుంటూ
మనలోపాలు మనమే సరిచూసుకుంటూ
తెగిపోతున్న తీగల్ని సరిచేసుకుంటూ
నిజామాబాద్ జైలు గోడల మీది
దాశరథి ఆవేదనను ఆవాహన చేసుకుందాం
మనకోటి రతనాల వీణమీద
మూడున్నరకోట్ల ప్రజల
ఊపిరులను సిద్ధం చేద్దాం.
మన నాగేటిచాళ్ళ తెలంగాణను
తీరొక్క రాగాల మాగాణం చేద్దాం
ఉద్యమమై బతికి
ఉద్యమంగానే జీవిద్దాం

మన నేలతల్లి విముక్తి కోసం
నేలరాలేదాకా పోరాడుదాం ...





# విద్యార్థి వీరులకు జోహార్లు

గద్దర్

వీరులార - మీకు జోహార్లు ...
పారె నెత్తుటి పోరుల జోహార్లు ...
విద్యార్థులార జోహార్లు ...

పొద్దుపొడిసె యాల - చదువు నేర్పియాల
ఆటలాడుకొని - పాట పాడెటియాల
చదివించిన తల్లి - సద్దిమూటయ్యే వేలా
తెలంగాణ తల్లి - సంకెళ్ళ తెంపనికి
జై తెలంగాణ అంటు - జెంగులోన దుంకి
కాంగ్రేసు సర్కారు కాల్పులకు ఎదురొడ్డి
తుపాకి గుండ్లకు గుండెలను చూపిన విద్యార్థులారా

నూనూగు మీసాల నూరేండ్ల బతుకులు
కన్న తల్లీ దండ్రి కలల పంటలు మీరు
భరత మాతా తల్లి భావి పౌరులు మీరు
శాస్త్రవేత్తలు మీరు సమరయోధులు మీరు
నిజమైన ప్రేమికులు - లైలా మజ్నూలు మీరు
భగత్ సింగన్నకు భలె ముద్దు తమ్ముళ్ళు

తెలంగాణ తల్లీ కన్నీళ్ళు బెట్టితె
రణం లోనా దుంకి రుణం దీర్చుకున్న

మీ త్యాగం చూసి సృష్టి బిత్తరబాయె
గోదావరీ తల్లి గుండె కద్దూకుంది
కృష్ణమ్మ తల్లిరా కన్నీళ్ళు రాల్చింది
సింగరేణి తల్లి శిగ ముడి ఇప్పింది
దండకారణ్యం మీ మెడల దండయ్యె
అడవి గోగుపూలు ఆరతీ బట్టినయి

వీరత్వము చూసి - శూరత్వము చూసి
కొమరం భీం అన్న మా కొడుకులే అండు
సమ్మక్క సారక్క శభాష్ కొడుకంది
చాకలి ఐలమ్మ ముద్దాడి మురిసింది
బందగి చెయ్యెత్తి వందనం అన్నాడు
వీర తెలంగాణ పేరు నిలిపింద్రని
పల్లె పల్లె మీకు మల్లెలు చల్లినయి

మీ చావు వార్తా విన్న మా కోడిపుంజాలు
కాళ్ళకు కత్తులు కట్టుకొని దుంకినయి
మీ అరుపులు విన్న మా ల్యాగదూడలు
కొమ్ములు ఆదిలించి కోడెలై లేసినయి
పాలు తాపిన పిల్లి పెంచుకున్నా కుక్క
మీ పోరు దారుల్లో పరుగులు దీసినయి



మీ త్యాగమును చూసి - మీ ధైర్యమును చూసి
భద్రాది సీతమ్మ భళిరే భళి అన్నాది
కొమరెల్లి మల్లన్న కూత బెట్టినాడు
యముడాల రాజన్న శంఖం ఊదినాడు
యాదగిరి నరసింహా యుద్ధంకే సిద్ధమని
వేయి స్తంభాల గుడి జై జై అంటు
రామప్ప గుడి లేసి రణం గంటా ఊపె



# వీరులకు మరణమా?!

ఉదారి నారాయణ

వీరులు మరణిస్తే
ఉద్యమాలు బెంగటిల్లుతాయి
పోరాటాలు మసకబారుతాయి
మీ బలిదానాలకు
వాళ్ల కంటి కొలుకుల్లోంచి
ఒక్క దుఃఖపు చుక్కైనా రాలనప్పుడు
గుండె గదిలో రెండు
వేదనా కదలికలైనా పుట్టనప్పుడు

చావుకెందుకు మీకు మీరే
రహదారులు పరుస్తున్నారు
మీ ఊపిరి బెలూన్లతో వాళ్లు
ఆనందాన్ని హత్తుకుంటున్నారు
మీ గాయాల్లో, అరుపుల్లో, చావుల్లో
వాళ్లు సర్కస్ వినోదాన్ని చూస్తున్నారు
వయోలిన్ రాగాన్ని వింటున్నారు

సహనం కుతికెను చుట్టుకొని
తొందర పెడుతున్నదేమో!
ఆశలు ఆవిరై మెదడు గోడల్ని
బద్దలు చేస్తున్నాయేమో!

కానీ ...
వీరునికి పోరాటమే ఊపిరి
ఉద్యమమే చిరునామా
కోట్లాది గొంతుల్లో
ఉద్యమం ప్రతిధ్వనించి
ఎందరికో విముక్తి తలుపులు తెరవాలి
ప్రతి పల్లె ప్రతి ఇల్లూ ...
మీ మెడలో స్వాగతాల
పూల దండలేసి ఊరేగించాలి
పిరికితనం ఉడుకునెత్తురుకు బద్ధశత్రువు
నిరాశా ఆశయ సాధనకు హంసపాదు

బొగ్గు ముద్దలైన మిమ్మల్ని,
ఊగుతున్న ఉరితాళ్లని చూసి
తెలంగాణా శోకాల జలపాతమవుతున్నది

ముక్కలైన మీ ఆశయాలకు
చెక్కలైన మీ ఆదర్శాలకు
పోరుభూమి బోరుమంటున్నది
శ్మశానం కూడా

కుప్పలు కుప్పలుగా కుమిలిపోతున్నది
ధీరులు లేని దేశం బానిసల సత్రం
వీరులు లేని ప్రాంతం చీకటి బంధిఖానా
ఎర్రమట్టిని అద్దుకొని పొడుచుకొచ్చిన
తెలంగాణా బిడ్డలు మీరు
ఈ విముక్తి నేల తొలిపొద్దుకు
మీరే వీర కిరణం కావాలి
ఆ తొలి పొద్దులో విజయపతాకమై
రెపరెపలాడాలి
బిడ్డలారా!
రేపటి దూతలారా
మీరు చావొద్దు
మీకు చావు అసలే వద్దు





8

# శిరసెత్తుతూ ...

కాంచనపల్లి

ఎంతకూ అర్థం కాదు
ఎవరూ ముడివిప్పలేరు
వేయి బండల కెదురుగా
ఒక నది
కోటి అపవాదపు కుబుసాలలోనే
పడగ విప్పే నాగు
.. ... ... ... ... ..
నీ బతుకు చమురుతో
ఒక దుఃఖదీపం వెలిగించుకున్నావ్
నీది కాని యాసలో నిన్ను నువు పరాయీకరించుకున్నావ్
తలకిందులైన కలల అంచుమీద
అబద్ధపు నిజంలా నిలబడిపోయావ్
సస్యం చీరగట్టని నేలమీద
చెలియ మొహం తెలియని బాటసారివయ్యావ్
వలసలు ...
కన్నీళ్లు ...
పరిహాసాలు ...

నీ పేరుతో పెద్దగా బలుస్తున్న
ఇంటివాళ్ళు
నీ మీద మహాజాలితో నిన్నే
నీకు దానం చేసే పొరుగు వాళ్ళు
నీపై తన పెత్తనం కోసం
దగా కత్తులు చేతపట్టుకొని
తన పంజా విప్పే తెల్లపోలీస్ దొర
అలుకు తడి తెలియని
వాకిలి వయ్యావ్ కదా
పుట్టమన్ను ముట్టుకోని
అరుగు వయ్యావ్ కదా
ఒక మొలుస్తున్న చరమాంకం
అది పాటై ... పరుగై
దోపిడీ కంచెను చీల్చుకొని
శిరసెత్తుతూ ...
ఎలుగెత్తుతూ ...
పరుగెత్తుతూ ...
శివ మెత్తుతూ ...





# సంకల్పం

అమ్మంగి వేణుగోపాల్

ఏ సముద్రమూ నదులవెంట పడదు
యువశక్తి 'రాజకీయం' వెంట నడవదు
ముందు చార్మినార్ తనను నిర్మించుకుంటుంది
ఆ తర్వాత చౌరస్తా దానికి సాగిలపడుతుంది
విద్యార్థి వజ్రసంకల్పం ముందు తలవంచి
రాతిగోడలు విశ్వవిద్యాలయాలవుతాయి

నిన్నటిదాకా ఒక కొలమానంగా సాగిన కాలం
ఎదురీదే యువరక్తంతో ప్రయాణం చేసి
ఒక ప్రమాణమౌతుంది

ఇంత చలిలో హిమాలయాన్నే వణికించే దీక్ష
మంచు అల్లిన మల్లెమాలను మెడలో ధరిస్తుంది
నగ్న ఛాతీలతో అగ్నిగోళాలను ఎదిరించే సాహసం
సామాన్యులను సైన్యంగా తీర్చి కవాతు చేయిస్తుంది

కొదమసింహాల పోరాట రుతుగర్జనతో
జైళ్ళ సంకెళ్లు స్వేచ్ఛతో రగిలిపోతాయి
యాభయ్యేళ్ళ నాడు ఆకాశాన్నంటిన నినాదం
అమరవీరుల తేజస్సుతో సమరవీరులను చేరుతుంది

'జై తెలంగాణ' సమస్త సముద్రాల ఘోషై
ఝంఝూ మారుతాల శ్వాసై
పర్వత పంక్తుల ఉక్కు పిడికిళ్లై
పిడుగై చరిత్ర ముందడుగై
ప్రజల ఆత్మలలో ఆత్మ అవుతుంది.







# తెలంగాణ కవిత - 2007

ఈనాడు




'గతులుండీ వసతులుండీ
బొండిగె పిసుక్కుంటున్న ఊరు తెలంగాణ
నదులుండీ చెరువులుండీ
దూపకు ఏడుస్తున్న భూమి తెలంగాణ'

తెలంగాణ ప్రాంతం దశాబ్దాలు గడిచినా ఆశించిన అభివృద్ధిని సాధించలేదనే ఆర్తి మాత్రమే కాదు, అందుకు హేతుభూతమైన రాజకీయం మీద ఆగ్రహం కూడా అభివ్యక్తం చేస్తూ – ప్రాంతీయతను ప్రాణప్రదం చేసుకుని, ఇప్పటికైనా ఆత్మగౌరవ స్వతంత్ర ప్రతిపత్తితో జీవించాలనే ఆకాంక్షకు అక్షరాకృతి నిచ్చిన కవుల పతాక 'తెలంగాణ కవిత – 2007'. 'అవసరం కొంత – అవకాశం కొంత – కష్టపడి తయారు చేసిన నావకు తడిలేనివాడు నావికుడు కావచ్చు' అంటూ 'ఒక మొదలు – ఒక చివర – రెండు కొసలు కలిపేదే జీవరేఖగా నిలబెట్టిన సమష్టి గళం' ఈ సంకలనం. జూకంటి జగన్నాథం, నందిని సిధారెడ్డి, జూలూరు గౌరీశంకర్ ... వారూ వీరనేముంది, ఇందులోని యాభై ఎనిమిది మంది కవులూ అక్షరాలా జరుగుతున్న మోసాలకు ఎదురొడ్డుతూ – 'తెగిస్తే పోయేదేమీ లేదు – సంకెళ్లు తప్ప' అన్నట్లు అభివ్యక్తమవుతున్న వారే. 'తన్ను తాను చంపుకుని – ఆత్మను అంగట్లో పెట్టుకుని – ఈ నేల ఔన్నత్యాన్ని ఎవడైనా ఈడనే జెండా ఎగరేయగలడా?' అని తెలంగాణను భుజానకెత్తుకుంటున్న కుహనా నేతలను సూటిగా ప్రశ్నిస్తున్నారు దేవరాజు వంటి కవులు. తెలంగాణ ఆత్మీయతనూ ఆత్మనూ అస్తిత్వాన్నీ ఆత్మగౌరవాన్నీ ఆవిష్కరిస్తున్న కవితా సంకలనం ఇది. కొందరు కవుల భావ వ్యక్తీకరణలో కొంత వైరుధ్యం పొడచూపుతున్నా, సున్నిత మనస్కులైన కవులూ రచయితలది ధర్మాగ్రహం కాబట్టి, విజ్ఞతతో అర్థం చేసుకుని అభినందించాల్సిందే.

**– సుధామ**

## ఆంధ్రజ్యోతి

మా అవమానాలు యింకా సల్లారని కాష్టాల గడ్డలే
పక్షలు గూల్లు గట్టుకున్నట్టు
మా గుడ్ల నీల్లు గుడ్లల్లనే కుక్కుకున్నం
మడుగుల నాసుబేరుకున్నట్లు
మా శోకం బేరుకునే వున్నది

*(గవాయిలేదని మా కేసును గడ్లె గలువుతరా! – జూపాక సుభద్ర)*

సుంకర రమేశ్ సంపాదకత్వంలో 58 మంది తెలంగాణ కవులతో వచ్చిన పుస్తకం. ఆలగడప (నల్లగొండ జిల్లా) మట్టి ముద్రణల తొమ్మిదో పుస్తకం ఇది. తెలంగాణ ప్రజలు జరుగుతున్న మోసాలను ఇక ఎంతో కాలం సహించలేరు. తెగువ ఇక్కడి నైజమని కవులు చాటుతున్నారు – అని 'ధోక'లో ఈ ప్రాంతంపై జరిగిన, జరుగుతున్న అణచివేత, మోసం, కుట్రల గురించి విపులంగా రాశారు.

**– ఇంద్రవెల్లి రమేశ్**

## హైదరాబాద్ మిర్రర్

గీ వయ్యి 2007 సంవత్సరంల వచ్చిన కైతల్నుంచి అవ్వల్దర్జ కవితలనేర్చి కూర్చిన సంకలనం. గివ్వన్ని తెలంగాణ కైతలే. తెలంగాణ గురించి చెప్పిన కైతలే. గీ పుస్తకం చదువుతంటె తెలంగాణ స్వరూప స్వభావాలన్ని కండ్ల ముంగట నిలుస్తయి. మస్తు సంబూరమైతది. కోపమస్తది. ఆవేశమస్తది. నా తెలంగాణ ఏమైతుందని బాధ కలుగుతది. గీ వయిని సుంకర రమేశ్ సంకలనం చేసిండు. గీనె ప్రతి సంవత్సరం గిసోంటి కవితలను పుస్తకంగ చపాయించుతండు. గీ కవితల్లిండ వస్తు వైవిధ్యం, అస్తిత్వ పోరాటాల వేదన కనపడుతయి. తెలంగాణ నేల గొంతుల తడిలేకున్నా మంది దూపను తీర్చే నేలంటడు కవి. తెలంగాణ గురించి గీ మాటలు యదార్థ జీవిత వ్యదార్థ దృశ్యాలు. ఉరితాళ్ళల్ల తలుకాయలు పెట్టి తెలంగాణ మట్టినోల్లు మౌనంగున్నయంటడు మరోకవి. ఇంకో కవికి తెలంగాణనిత్య బాలెంత. తెలంగాణల ఆత్మహత్యలు సహజమై పోయిన వైనాన్ని దయనీయంగా చిత్రించిండో కవి. తెలంగాణలో సేతనం లేని బీల్లు కనిపిస్తాయంటాడోకవి. ఇలా తెలంగాణ గురించి అరొక్క విషయాన్ని గీ కవితలల్ల చెప్పిండు కవులు.

తెలంగాణ కవిత్వం రూపపరంగా, వస్తుపరంగా బహుముఖాలుగా విస్తరిస్తున్నది. జీవితంలోని అనేక పార్శ్వాలకు ఆర్ట్ ఫిల్మ్‌లా చూపిస్తుంటే నేటివిటిని కవిత్వంలోకి తీసుకురావడం మంచి పరిణామం, ఉపరితల అంశాలను మాత్రమే పట్టించుకోకుండా కార్యకారణ ఫలితాలను తాత్విక కోణంలో ఆవిష్కరిస్తున్నారు. స్త్రీవాద, దళితవాదులు లేవనెత్తిన తాత్విక ప్రశ్నలకు కొనసాగింపుగా తెలంగాణ కవులు తమ నేలపై నిలబడి నిలదీస్తున్నారు. ధోకకు గురవుతున్న తెలంగాణ ప్రజల ఆశల, ఆకాంక్షలకు ప్రతిరూపం ఈ కవితలు ...

సుంకర రమేశ్ అనగానే తెలంగాణ కవిత్వం గుర్తుకొస్తుంది. ప్రతి సంవత్సరం క్రమం తప్పకుండా ఎంతో శ్రమకోర్చి తెలంగాణ కవితా సంకలనాలు తెస్తున్నారు. ఇందులో భాగంగానే తెలంగాణ కవిత 2007ను తెచ్చిండు. ఈ సంకలనంలో మొత్తం 58 కవితలు ఉన్నాయి. వస్తు వైవిధ్యం అస్థిత్వ పోరాటాల వేదన, అభివృద్ధిలో నూతనత్వం ఈ కవితా సంపుటి ప్రత్యేకత. వందల కవితలలో నుంచి ఉత్తమమైన వాటిని సంకలనంలో చేర్చడం కత్తిమీద సాము లాంటిదే.

అబంటి వెంకన్న రాసిన ఈళ్లూ రజాకార్లే ... అనుకవితలో

గొంతుల తడి లేకున్నా
మంది దూప దీర్చడానికి ఆరాటపడే నేల ఇది
ఎదిటోని కుట్రలు తెలిసి గూడ
పెదవిరిసి దుఃఖాన్ని దిగమింగుకునే జాలిది
త్యాగంలోను బలిదానంలోను
వెనుకడుగు వేయని మొండిదిది.

తెలంగాణకు సంబంధించి పై పంక్తులు నిత్యయధార్థ చిత్రాలు. తెలంగాణలో తాగడానికి నీరు లేకున్నా ఇతరులు దూప తీర్చడానికి ఆరాటపడుతుంది. సీమాంధ్ర వలస పాలకుల కుట్రలు, కుతంత్రాలు తెలిసికూడా దుఃఖాన్ని గొంతులోనే సమాధి చేసుకొంటున్నది. త్యాగంలోను, బలిదానంలోను బహుశా ప్రపంచంలోనే మహా మొండిది తెలంగాణ అని కవి చక్కగా తెలంగాణ స్వభావాన్ని అక్షరీకరించారు.

వేముగంటి మురళీకృష్ణ రాసిన ఒకటే ముఖం కవితలో

ఇక్కడ మట్టిగోడకు
కొడుకు ఫోటో గాలికి కొట్టుకుంటున్నది
అక్కడ ఉరితాళ్ళల్ల తలకాయలు పెట్టి
మౌనంగున్నయి తెలంగాణ మట్టినోళ్ళు

తెలంగాణలో ప్రతి పల్లెలో సర్వసాధారణ దృశ్యం ఇది. మట్టిగోడకు వేలాడుతున్న కొడుకు ఫోటో, ఉన్నాడో లేడో తెలియని ఆ తల్లి దుఃఖాన్ని ఆపేదెవరు? ఆ కొడుకు వలసే పోయిండో, బతుకు భారమై బలిదానం చేసిండో ఎవరికెరుక? తెలంగాణ రైతులు ఉరితాళ్ళలో బలవంతంగా తలకాయలు పెట్టి మౌనంగా చావుకు ఆహ్వానిస్తున్నారు.

కాసుల ప్రతాప్ రెడ్డి కవిత కంటి పాపల మీద పరికి కంప అను కవితలో...

తెలంగాణ నిత్తె బాలెంత
పురుడు పురుడికీ నేనే పుడుత
పసుర మిక్కడ గొడ్డు బోదు
మనుషులిక్కడ ఆత్మలు కాల్చరు

తెలంగాణలో ఆత్మహత్యలు సహజమైనవి. ఈ ఆత్మహత్యలకు శతకోటి కారణాలు ఉన్నాయి. అయినా తెలంగాణా నిత్తె బాలెంత ప్రతి పురుషుడికీ నేనే పుడత అంటున్నాడు కవి. తెలంగాణలో పుట్టడంలో ఎంత అదృష్టమో మర్మగర్భితంగా కవి చెబుతున్నారు.

పగడాల నాగేందర్ రాసిన కలల బతుకమ్మ అను కవితలో ...

మా కళ్ళలోకి సూటిగా చూడు
కొబ్బరి తోటలు కాదు, పచ్చని వరిపైర్లుకాదు,
ఏపుగా పెరిగిన కలమంద జెముళ్ళు కన్పిస్తాయి!

సేతనం లేని బీళ్ళు కనిపిస్తాయి.

తెలంగాణలో వ్యవసాయం ఎంతో దారుణంగా తయారయ్యిందో ఈ కవితలో రచయిత వ్యక్తీకరిస్తున్నాడు. మా కళ్ళలోనికి సూటిగా చూడండి మీలాగా మాకు కొబ్బరితోటలు, వరిపైర్లు ఉండవు. తెలంగాణలో కేవలం పుష్కలంగా మొలిచిన కలమంద జెముళ్ళు మాత్రమే కనిపిస్తాయి. సత్తువలేని బీళ్లు తెలంగాణలోని పల్లె పల్లెలో కనిపిస్తాయి.

అన్వర్ కాగజ్ నగర్ అనుకవితలో అడివిని మింగి

నీటిని మింగి
మనసుల్ని మెల్ల మెల్లగా మింగేస్తుంది
దేశంలోని దుమ్ముకు పేదరికాన్ని
ఒక దగ్గర పేర్చిన
డంపింగ్ యార్డు కాగజ్ నగర్

తెలంగాణలో కాగజ్‌నగర్ పారిశ్రామికంగా అభివృద్ధి చెందింది. కానీ ఈ అభివృద్ధి పేదల పాలిట శాపమైంది. ఈ కాగజ్ నగర్ అడివిని మింగి, నీటిని మింగి, చివరకు మనుషుల్నే చంపేస్తుంది. ఈ దేశంలోని దుమ్మును పేదరికాన్ని ఒక దగ్గర పేర్చితే తయారయ్యేది కాగజ్ నగర్.

నడిగూడెం గట్లయిందేంది? అని జూలూరి గౌరీ శంకర్ ప్రశ్నిస్తున్నారు. మా నడిగూడెం నడిగూడెం నవిసినట్లయింది అంటారు.

గతులుండీ వసతులుండే
బొండిగె పిసుక్కుంటున్న ఊరు తెలంగాణ

జూకంటి కవిత్వశైలి ప్రత్యేకమైనది. తెలంగాణ జీవద్భాషను కొత్తగా పలికిస్తాడు. తనకంటూ డిక్షన్ సృష్టించాడు. దొడ్డి రామ్మూర్తి

ముదిగొండ నెత్తురు మా కన్నీటి మడుగు అంటూ వర్తమాన విషయాల్ని కవిత్వం చేస్తున్నాడు.

తెలంగాణలో ముఖ్యంగా హైదరాబాద్ నగరంలో ఇరానీ కేఫ్‌లు సామూహిక ఆత్మల కలబోత. నగరం విస్తరిస్తున్న కొద్దీ ఇరానీ కేఫ్‌లు మాయం అవుతున్నాయి. ఇప్పుడు తావుకోసం పక్షులు గిరికీలు కొడుతున్నాయి.

గోపగాని రవీంద్ర గిరిజనం అను కవితలో

"అంతుచిక్కని రోగాలతో మరణం
అడవి గుండెకు గాయం

దారులాత్ చెందిన రక్తం

ఎవ్వరిని నిందించాలి?"

తెలంగాణలో గిరిజన పల్లె జీవితాలను కవి చక్కగా వర్ణిస్తున్నారు. గిరిజన ప్రాంతాలలో అంతుచిక్కని రోగాలతో రోజుకు ఒకరు చనిపోతున్నారు. గిరిజన పల్లె ప్రాంతాలలో కనీస వైద్య సౌకర్యాలు లేవు. ఈ వైపు ఆలోచించదానికి ప్రభుత్వానికి తీరిక లేదు. గిరిజన పల్లెలను మీరు దర్శిస్తే దారంత చెందిన నెత్తురు కనిపిస్తుంది. ఈ అన్యాయాన్ని ఎవరికి వినిపించాలి? ఎవరిని నిందించాలి? అని కవి వాపోతున్నారు. మొత్తానికి తెలంగాణ కవిత 2007 ప్రతి ఒక్కరు చదవవలసిన చక్కటి చిక్కనైన కవిత్వ సంపుటి సుంకర రమేశ్ అభినందనీయులు.

– ఇ. వెంకటేశ్

# ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల నల్లగొండ విద్యార్థినులు చేసిన సమీక్షలు

వీక్లీ పుస్తకాలు, మ్యాగజైన్లు, కథల పుస్తకాలు చదువుతూ కాలం గడిపే మాకు ఎడారిలో నీటి శెల్మలలాగా అందిన ఒక పొలవన్నె గల మల్లెపూల గుత్తి తెలంగాణ కవిత (2007). దానిని చూడగానే నా మనసులో (గుభాళించే) పరిమళాలు వెదజల్లే మల్లియల గుచ్ఛం అనుకున్నా, కాని దానిని చదివిన తరువాత తెలిసింది. అది ఎర్రమల్లెల గుచ్ఛం అని. సువాసనలు వెజల్లుతుంది అనుకున్న నాకు అందులో నాసిక రంధ్రాలను తాకేది మట్టి వాసనలు, రక్తపుటేరులు ప్రవహించిన త్యాగాల వూసులని.

గొప్పదైన ఇంతటి పుస్తకం మా కళాశాలలో మా చేతుల మీదుగా ఆవిష్కృతమవ్వడం, మా చేతనే ఈ పుస్తకాన్ని సమీక్షింప చేయటం జరిగింది. మహాశా ఇది తెలుగు సాహిత్య చరిత్రలో ఒక గొప్ప చారిత్రక సందర్భం అనుకుంటాను. కవిత్వోద్యమపు మైలురాయిగా భావిస్తాను. ఈ పుస్తక సంపాదకుడు సుంకర రమేష్ కాగా, ప్రచురణకర్త శ్రీ వేనేపల్లి పాండురంగారావు గారు. ఈ సంకలనాన్ని అంకితం చేస్తూ అతడు రాసిన (ఎవరి రక్తంతో తడిసి ఈ మట్టి ఎరుపెక్కిందో ఎవరి చెమటతో తడిసి ఈ మట్టి నల్లబడ్డదో, ఎవరి కన్నీళ్ళలో తడిసి ఈ మట్టి తెల్లబడ్డదో వారికి ...) మాటలు – తెలంగాణ బిడ్డలందరి గుండెలలో గుడి గంటలే మ్రోగుతూ వున్నాయి. ఆ అంకితం మాటలు పాఠకుల మనసులను ఆ సంకలనానికి అంకితం చేయించాయి. ఆ మాటల లోతులను స్పృశించకుండా ఎవరూ ఉండిపోలేరు.

ఇందులో మొత్తం 58 కవితలున్నాయి. ప్రతి కవిత మనకు జీవితపు నీడలను, జ్ఞాపకాలను, బాధలను, కర్తవ్యాలను, ఒకప్పటి – ఇప్పటి ఆర్తనాదాలను మనకు తెలియజేస్తూ మన మనసులోవున్న ప్రతి వివక్షకు అర్థం చెబుతూ, దారి చూపిస్తూ, కఠినంగా, మృధువుగా, జాలిగా వ్యక్తం చేస్తున్నాయి. గొంతున తడి లేకున్నా మంది దూప ఆర్పడానికి ఆరటపడే మనసులకు ఒక కవిత్వోద్యమంగావున్న ఈ కవితలు అన్నీ, సవతి తల్లి ప్రేమ మాకు వద్దు. మాకన్న తల్లిని మాకందిస్తే తల్లి ఒడిలో కష్టాల బ్రతుకు నొదలి చల్లగా హాయిగా సేద తీరుతామంటున్నాయి. న్యాయం కోరుతున్నాయి.

రజాకార్ల కాలంలో మన దేశీయులు పడిన బాధలు పరాయివాడికి కూడా కలగకూడదు. కాని, అదే పరిస్థితి తిరిగి ఇప్పుడు తెలంగాణలో చోటు చేసుకుని వుంది. మనది అయినది కూడా మనకు దక్కనీయకుండా నోటికాడి నీటిని దోచుకుపోతున్నారు. అంబటి వెకన్న రాసిన "ఈల్లూ రజాకార్లే" ... అనే కవిత "గొంతుల తడి లేకున్నా మంది దూప దీర్పడానికి ఆరాటపడే నేల ఇది ఎదిటోని కుట్రలు తెలిసి కూడ పెదవిరిసి దుఃఖాన్ని దిగమింగుకునే జాతి యిది త్యాగంలోను బలిదానంలోను వెనకడుగు వేయని మొండిదిది" అంటూ అనేక విషయాలను పాటగా ప్రతిధ్వనింపజేస్తున్నారు.

మన సమాజంలో వున్న మానవ జాతికి వెన్నెముక రైతు. అటువంటి రైతు అప్పుల పాలై పడుతున్న కష్టాలను వేముగంటి మురళీకృష్ణ – "ఒంటె ముఖం" అనే కవితను మనకు వెన్నుపూసగా అందించాడు –"దూలానికి అప్పులు చీకుల లెక్క వేలాడుతున్నప్పుడు మట్టిని గాఢంగా ప్రేమించిన మనిషి ఎడారిని వెతుక్కుంటున్నాడు – హృదయాన్ని పొలంల పాతి పెట్టి శరీరం కదిలిపోయింది" అంటూ చూపెడుతున్నాడు.

ప్రతి ఇంటిలో పూర్వపు జ్ఞాపకం వుంటుంది. దానిని తెరిచినప్పుడు సంతోషంగాని, ఉద్వేగం గాని, ఆవేశంగాని, ఆలోచన గాని కలుగుతుంది. కాని పసునూరి రవీందర్ రాసిన "జ్ఞాపకాల ఖజానా"! అనే ఈ కవిత "నాన్న జీవిత కాలపు నిరుద్యోగానికి గుర్తుగా మిగిలిన ఎంప్లాయిమెంటు కార్డు – ఆకలి ముఖంతో దిగిన అమ్మ పెండ్లి నాటి ఫోటో" – కనిపించడం పాఠకులను నిలువునిస్తారం దుఃఖంలతో తడిపి వేస్తుంది. మన దారిద్ర్యానికి అద్దం పడుతుంది. ఈ కవితలో మరొకటి "బతికి చెడ్డ తనాన్నీ" చెడి బతికిన తనాన్నీ చెప్పే సందుకలాంటి మనిషి కావాలి". కోరడం / ఆకాంక్షించడం, మనిషి ముందు తరాలకు చెప్పగలుగుతాడో

లేదో తెలియదు గాని గత చరిత్రను కళ్లముందుంచే ఇలాంటి సంకలనం ఒకటి వుంటే చాలు అని నా అభిప్రాయం.

ఈ సంకలనంలో ప్రతి కవిత "ముత్యం"లాంటిది. అందులో నీకు ఏది నచ్చిందంటే నేనేం చెప్పగలను? "హారం" కావాలంటే అన్ని ముత్యాలను కూర్చాలి కదా! నా గుండెలో, మనసులో, మెదడులో శరీరం మొత్తంగా జీర్ణించుకుపోయినవి యిందులోని కవితా వస్తువులు, వ్యక్తీకరణలు.

తైదల అంజయ్య గారు రాసిన "పెత్తరమాస" అనే కవితలో – "మరణం ఒక చీకటి / అది బ్రతుకు వెలుగు అందుకోని వారికి!" "చీకట్లను వెంటాడి వెలుగుతూ / బతికినవాళ్ళ మరణం కూడా వెలుగే" అంటూ గొప్ప జీవిత సత్యాన్ని, తాత్వికతను, స్ఫూర్తిని కలిగించే విధంగా రాసినందుకు నా జోహారులు.

అందమైన చందమామకు మచ్చలాగా ఈ పుస్తకంలో అచ్చుతప్పులు (క్షమించాలి చెప్పేంత పెద్దదానిని కాకపోయినా) ఒక విద్యార్థిగా, అభ్యాసకురాలిగా నా బాధ్యతగా చెబుతున్నాను, చోటు చేసుకోకుండా వుంటే బాగుండేది. గొప్ప భావాలతో వున్న ఈ సంకలనాన్ని సమీక్షించడం జీవితంలో తొలి మైలురాయి. ఇంతటి అవకాశం కల్పించిన తెరవెనుక వున్న వ్యక్తి వేణు సార్‌గారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

– ఎస్. శోభ

తెలంగాణ కవిత 2007 పుస్తకంలో శ్రీ వేనెపల్లి పాండురంగరావు గారు రాసిన ముందుమాట

"ఎవరి రక్తంతో తడిసి మట్టి ఎరుపెక్కిందో,

ఎవరి చెమటతో తడిసి మట్టి నల్లబడ్డదో,

ఎవరి కన్నీళ్ళతో తడిసి మట్టి తెల్లపడ్డదో వారికి అంకితం" అనేది మనస్సును స్పృశిస్తున్నది.

ఈ కవితా సంకలనంలో మొత్తం 58 కవితలున్నయి. ఒక్కొక్క కవిత ఒక్కో విధంగా తెలంగాణా ప్రజల ఆవేదన, వారు మోసానికి ఎలా గురయ్యారు, ఆకలి, దరిద్రం, బానిసత్వంతో ఎలాంటి బాధలననుభవించారు, నిజాం పాలనలో రజాకార్ల ఆగడాలు, ఎందరో ప్రాణాలను త్యాగం చేసిన వారు, ధీరులు, చరిత్ర, సంస్కృతి గ్రామీణ వాతావరణం – వంటి నిజానిజాల్ని ప్రతిబింబిస్తూన్న కవితలను చదువుతుంటే ఒళ్ళు జలదరిస్తుంది. కొన్ని కవితలు కన్నీటిని తెప్పించేలా, మనస్సును కకావికలం చేసేలా ఉన్నాయి. తెలంగాణా ప్రజలకు దక్కవలసిన ఫలితాలు దక్కడం లేదు. మోసాలకు గురికావడం, అభివృద్ధి గురించిన చర్చకూడా వర్తమాన తెలంగాణా చరిత్రలో ప్రధాన విషయం. ఈ కవితలలోని జీవితంలో భిన్న పార్శ్వాలను, తెలంగాణా నేలలో వస్తున్న మార్పుల్ని, సామాజిక న్యాయన్ని గూర్చి ఎంతో బలంగా కవితల్లోకి దింపాయి – కొందరి రచనలు.

కవితలలోని చాలా బొమ్మలు కూడా వివిధ భావాలను, మోసం, బాధ, ఆకలి, గ్రామీణ వాతావరణం వంటి అంశాలను చూడగానే దాని సారాంశం తెలిసేటట్లుగా ఉన్నాయి. ఈ కవితలలో ఇద్దరు కవయిత్రులు మాత్రమే ఉన్నారు.

ఇంకా ఎక్కువ మంది కవయిత్రులు ఉంటే బాగుండేది. కవుల / కవయిత్రుల చిరునామా, ఫోన్ నెంబర్లు ఉంటే బాగుండేది.

ఈ కవితలలో చదివే కొద్దీ హిరోషిమా, వియత్నాం, జలియన్‌వాలాబాగ్, లాహోర్, చుండూరు, కారంచేడు, ఆఫ్ఘనిస్తాన్, బాగ్దాద్, రాజస్తాన్, గుజరాత్, నందిగ్రామ్, బషీర్‌బాగ్‌లలో జరిగిన నరమేధాన్ని, రక్తం చారలు కట్టేలా ఎ.కె.47 గుళ్ళను కురిపించిన దృశ్యాన్ని కళ్ళకుకట్టడం మొదలెడతాయి.

"కన్నీళ్ళు నా కాయె, నీళ్ళునీకాయె" అనే తెలంగాణ నీళ్ళు అవతలి ప్రాంతానికి తరలిపోతుండటం, మంది దూపదీర్చడానికి ఆరటపడే నేలయిది. 610 జీవో అమలులో రాజకీయ నాయకులు జాప్యం చేయడం, త్యాగంలోను, బలిదానంలోను వెనకడుగువేనిది తెలంగాణకు జరుగుతున్న అన్యాయాన్ని సహించలేక వలసదోపిడీ దారుల నుండి "వేరై తీరుదాంరా" అని, విడిపోవాలని (ఇడుపుగాయితం) కోరుకుంటున్నాయి – స్పష్టంగా కవితలు.

"మాయా మర్మము లేని జాతర నా తెలంగాణా జాతర" మాకు గాని ఈ భూములెందుకు? మాకు దక్కని ఈ పంటలెందుకు?" అని ప్రశ్నిస్తూ, "గవాయి లేదని మాతేసును గడ్డె కలిపితిరి, చిన్న చేపను పెద్దచేప న్యాయం లాగా, జీవిత కాలపు నిరుద్యోగానికి గుర్తుగా మిగిలిన ఎంప్లాయ్‌మెంట్ కార్డ్ / నెత్తుటి పాట నా బతుకు పాట బతుకమ్మ పాట" అంటూ తమ ఆవేదనలను వ్యక్తం జేస్తూ "ఎల్లవ్వ తల్లికండ్లెర్ర జేసింది యిక సంచులు సదురుకోండ్రి బిడ్డా / నాటి తెలంగాణ దగాపడ్డ నెత్తుటి నేల, నేటి తెలంగాణా కొత్త వ్యూహాల పురిటిగడ్డ" అంటూ యిక అన్యాయం జరిగితే సహించేది లేదని దృఢంగా హెచ్చరిస్తున్నదీ – కవితా సంపుటి.

– షేక్ సుల్తానా

"ఎవరి రక్తంతో తడిసి ఈ నేల ఎర్రబడిందో

ఎవరి చెమటతో తడిసి ఈ నేల నల్లబడిందో

ఎవరి కన్నీటితో తడిసి ఈ నేల తెల్లబడిందో" –

అన్న వాక్యాలు చదవగానే రక్తం మరుగుతుంది. వారికి అంకితం ఇవ్వడంతోనే మానవత్వపు హృదయ వైశాల్యం మనకు అర్థమౌతుంది. దీనిలో 58 కవతలున్నాయి. వాటిల్లో నాకు నచ్చినవి "నడిగూడెం గిట్లయిందేంది" అనే కవితలో "నా ఊరు ఎందుకు ఇలా మారింది" అనే ఆవేదన వెంటాడుతూ వచ్చింది. "వేరై తీరుదాంరా!" అంటూ వేణు సంకోజు గారు వ్రాసిన కవిత ద్వారా మనం ఎందుకు ప్రత్యేక తెలంగాణ కావాలని కోరుకుంటున్నామో తెలుస్తుంది. ఎందుకు కరాఖండీగా వుండాలో అవగతమౌతుంది. "నేనెందుకు" అనే కవితలో వెంకట్‌గారు మన తెలంగాణ ప్రజలు పేదరైతులు పడుతున్న బాధలను హృదయం చలించేట్టుగా వివరించారు. మానీళ్ళు, భూములు అన్ని తీసుకున్నారు అంటూ కవి తన ఆక్రోశాన్ని వ్యక్తం చేస్తాడు. ఈ సంకలనంలో పసునూరి రవీందర్ గారు వ్రాసిన ఒక వాక్యం నన్ను ఆలోచింపచేసింది. కాదు వెక్కి వెక్కి ఏడ్చేట్టు చేసింది. నాకు మా వూరిలోని అమ్మలందరూ గుర్తుకొచ్చారు. అది "ఆకలి ముఖంతో దిగిన అమ్మ పెండ్లినాటి ఫోటో". రెండు– మూడు రోజులు కోలుకోలేకపోవచ్చు. ఇక అంబటి వెంకన్న గారు వ్రాసిన "ఈల్లూ రజాకార్లే" అనే కవితలో బ్రిటిష్ వారు ఉన్నప్పుడు ఎన్నికష్టాలు పడ్డామో ఇప్పుడు ఈ పాలకులతో కూడా అన్నీ కష్టాలను ఇప్పుడు మన ప్రజలు పడుతున్నారని వివరించడం అనేవి ప్రత్యక్ష సత్యాలు.

అవును, ఈ సంకలనం నిండా పూర్ణ సత్యాలు, సత్యాలైనప్పటికీ నిరాకరింపబడుతూ, అనాదరణకు గురౌతూ వున్న వాస్తవాలు. కేవలం ఆగ్రహావేశాలు కాని అభిప్రాయాలు, అన్యాయాలు తొలగిపోవాలనే ఆకాంక్షలు. ఇక్కడి వారందరికీ మంచి కాలాలు ప్రవేశించాలనే వ్యక్తీకరణలున్నాయి. దేనికదే ఒక ఎక్కు పెట్టిన బాణం. దేనికదే ఒక సిసలైన దిక్సూచీ. సంకలనం అంతా చదివాక యిక స్పందనలు – ప్రతిస్పందనలు – నెరవేర్చుకోవాల్సిన కర్తవ్యాలే గుర్తుకొస్తాయి.

– ఎం. రజని

ఈ తెలంగాణ కవిత – 2007 సంకలనంలో 58 కవితలున్నాయి. మన తెలంగాణ వాస్తవ్యులు పడే కష్టాల గురించి ఈ కవితల ద్వారా చాలా స్పష్టంగా తెలుస్తుంది. మనం తీసిన బావులు, కాలువలు, చెరువులు అన్నీ కూడా పోయి మనకు దక్కకుండా వుంటే, భూములతో సహా అవతలి వాళ్ళు దక్కించుకుంటున్నారు అనే విషయాన్ని మిగతా ఎన్నెన్నో తప్పకుండా తెలుసుకోవలసిన సత్యాలతో పాటు – ఇందులోని కవితల ద్వారా తెలుసుకోచ్చును. నమ్మి మనం అధికారంలో భాగం యిచ్చిన పాపానికి మనం మాత్రం వాళ్ళ మోచేతి నీళ్ళు త్రాగాల్సి వస్తుంది. ఇలా చెప్పుకుంటూ పోతే చాలా సమస్యలు ఉన్నాయి. ఈ తెలంగాణ కవిత పుస్తకంలో చాలా కవితలు మనల్ని మనం అర్థం చేసుకునేటట్లు చేస్తాయి. మన పరిస్థితులను యధాతథంగా మన కళ్ళకు కట్టిస్తాయి.

"గ్లోబల్ అపాలజీ" అని మామిడి హరికృష్ణ రాసిన కవితలో ఇప్పుడున్న భాషా, సంస్కృతుల, చారిత్రక – వారసత్వాల, హేతుబిజ్ఞాసల విధ్వంసాన్ని గురించి స్పష్టంగా తెలియకపోవడం విచారమని, అట్లా తెలియకుండా వుండేందుకు ప్రపంచీకరణ దయతో శ్రద్ధ వహిస్తున్నదని ఎద్దేవా చేశాడు. ఏదో ఒక రోజు మాత్రం మన మానవీయ – స్వేచ్ఛాయుతమైన ఆధునిక సాంప్రదాయాలకు, మన పురోగమన నాగరికతకు ప్రపంచీకరణ క్షమాపణ చెప్పే తీరాలి అంటున్న మామిడి హరికృష్ణతో మనం కదం కలుపుదాం.

"తండ్రి పేరు చెప్పమని పరుశరాముడు తరిమిన ఎల్లమ్మలా నా తల్లి తెలంగాణ మాదిగలొద్దిలో దాక్కుంది" అనే పంక్తులున్నాయిందులో. బలమైన వ్యక్తీకరణ. దళితులు, పేద వారి గురించిన ఆర్తి నిండిన ఆగ్రహం పంచారు – సి. కాశీంగారు.

ఇంకా మన తెలంగాణ ప్రాంత ప్రజలకు తీరని ముప్పు ఏర్పడింది అంటూ పి. విద్యాసాగర్‌గారు నిరసిస్తూ "ప్రజల కాళ్ళకు ప్రాజెక్టుల గంతలు కట్టి దారి తప్పించబడిన జాతి నాది" అంటూ వాపోయారు. ఒక వెనుకబడిన వర్గం వాడు అనుకోవడమే కాని ఏమీ చేయలేని స్థితిలో తాను నిస్సహాయుడు ఐనట్లు, మొండెం విరిగిన తలలా తాను గిలగిలా కొట్టుకొంటూ – ఇవ్వటమే తప్ప తీసుకోవటం తెలియని వాడ్ని ఏకలవ్యుడి వారసుణ్ణి" అంటున్న కవి కలకు, కాలజ్ఞానానికి ప్రతిస్పందిస్తూ, మట్టికి అంకితమయ్యే వారలుగా ఎదుగుదాం.

– బి. లలిత

తెలంగాణ కవిత – 2007 పుస్తకంలో 58 కవితలు ఉన్నాయి. ఇందులో ప్రతి కవితలో తెలంగాణ గొప్పతనం గూర్చి వివరించారు. ఈ సంపుటిలో నాకు వచ్చిన వాటిలో కొన్ని ...

"నా తెలంగాణ కోటి రత్నాల వీణ"
అని దాశరథి చెప్పినాడు వారి వంటి త్యాగధనుల ప్రసక్తితో
ముందుకెళుతుందిది.
"తల్లిపాల నురగలు
జున్నుపాల సెలయేళ్ళు
మా పొట్టల మీదుగా పారుకుంట
ఆవల భూములు తడుపుతున్నయ్"

ఇది "కేకలు" లోనిది! బాలాజీ నాయక్ తెలంగాణ గొప్పతనాన్ని వివరించారు. మన నీరు, మన భూములు దాటి అవతాల భూములను తడుపుతున్నయి అని చెప్పడం బాగుంది.

"చెప్పేది చెప్పుకుంట, అనేది అనుకుంట
ఇల్లిల్లూ వాడవాడా ఊరూరా
నలుగురు గుంపు ఎక్కడుంటే అక్కడ
ఒక్కొక్కసారి అందరికీ ఇనచ్చేటట్టు
ఇంకొక్కసారి తనది తనకే ఇనరానట్టు
తిరిగేది తిరుక్కుంటూ తాపీగా చెప్పేది చెప్పుతుండు
లోపలకెల్లి అనేది అంటుండు"
అంటూ, కసిగా, స్పష్టంగా, కూడా –

"తెలంగాణ ట తెలంగాణ" అనే కవితలో జూకంటి జగన్నాథం గారు వీరులకు ఒక సందేశం ఇచ్చినారు.

నాటి తెలంగాణ దగాపడ్డ నెత్తుటినేలే
కాని,
నేటి తెలంగాణ కోటి వ్యూహాల పురిటిగడ్డ



అని తెలంగాణ పోరాట లక్షణాలను ఏకరువు పెడుతున్నాడు.
"నీటి నిప్పు" కవితలో బాణాల శ్రీనివాసరావు.
తప్పుంద్రి ... తవ్వుంద్రి ... ఎల్లిన చరిత్రను తలకెత్తుకుందాం తవ్వుంద్రి
కోటి లింగాల రెండు వేల ఏండ్ల పై నాటి కోట
తెలుగు జాతికది పెద్దర్వాజ

"పెద్దర్వాజ" కవితలో అన్నవరం దేవేందర్ గారు తెలంగాణా సాంస్కృతిక వైభవాన్ని గురించి చెబుతూ, చరిత్రను తిరగ రాయాల్సిన అవసరాన్ని సూచిస్తున్నారు.

"ఇవ్వటమే తప్ప తీసుకోవడం తెలియని వాడ్ని
ఏకలవ్యుడి వారసుణ్ణి
ఇప్పుడు ఇవ్వటానికి ఏమీలేదు
పుట్టెడు దుఃఖం తప్ప" అంటూ

"ముంపు" కవితలో పి. విద్యాసాగర్ గారు రాసిన కవిత కలచి వేస్తూ ఉన్నది. అభివృద్ధికి, ఆదరణకు దూరమైన ఈ నేలతల్లి గోడును, ఆర్తిని వినిపిస్తున్నది.

మాకున్న సంపదంతా మీ అదనపు సంపదాయె.
ఈ అదనపు సంపదకోసమే గదా రైలింజన్ వెంట బోగీలు వస్తున్నట్లు
వస్తుంద్రు
గానుగెద్దుల్లా మీ చుట్టూ మమ్ముల్ని తప్పుకుంటుంద్రు
గవ్వకు సాటిగాకుండా జేస్తుంద్రు
మీ ఈ అభివృద్ధి మాయలో మేం మరణించేకన్న
బలుసాకు తినైనా మాకుమేం బతకడమే మంచిదనుకుంటున్నం"
"భూమి భవిష్యత్తు" కవితలో నాళేశ్వరం శంకరం గారు.

తెలంగాణ నుండి వలసాంధ్రులు విడిపోవాలని చక్కగా చెప్పారు. ఈ విధంగా ఈ కవితా సంపుటి నిండా తెలంగాణ గోస, తెలంగాణ యాస, తెలంగాణ శ్వాసలు నిండి వున్నాయి. చదివే కొద్దీ చైతన్యాన్ని పెంపు జేస్తున్నాయి.

– డి. శ్రీలత

ఈ తెలంగాణ కవిత - 2007 సంకలనంలో ఇద్దరు కవయిత్రులతో కలిపి మొత్తం 58 కవితలున్నాయి. ఇందులో ఇద్దరైనా కవయిత్రులు ఉండడం చాలా సంతోషకరమైన విషయం. దీనిలో. ప్రతి కవితా దేనికదే వైవిధ్యంగా ఉన్నది. కవిగా, ఆలోచించే విధంగా, సూటిగా, పదునెక్కివుంది. పాఠకులను కదలిస్తూ, చైతన్యాన్ని కలిగించే విధంగా ఉన్నది.

"జ్ఞాపకాల ఖజానా" పసునూరి రవీందర్ గారు మన ముందు వుంచుతున్నారు. "నాన్న జీవిత కాలపు నిరుద్యోగానికి గుర్తుగా మిగిలిన ఎంప్లాయిమెంటు కార్డు ఆకలి మొకంతో దిగిన అమ్మ పెళ్ళి నాటి ఫోటో" - చాలా బాగా వివరిస్తుంది.

"పగటిని రాత్రిగా, రాత్రిని పగటిగా ప్రకటించే వాడు ఆత్మ విమర్శ చేసుకోవాలి - చేతులతో నడుస్తూ కాళ్ళతో నమస్కారాలు చేసే కుసంస్కారి ఈ జాతి ముష్కూటికీ క్షమించదని తెలుసుకోవాలి!!" అంటూ "రజాకార్" అనే కోస్తాంధ్ర వలసవాదులు ఏ విధంగా కొత్త రజాకార్లయిందీ, వెంటనే ఏమి తెలుసుకుని ఎట్లా మసలుకోవాల్సిందీ - తేటతెల్లం చేస్తున్నాడు.

"కన్ననేల సంకెళ్ళను తెంచే ఆయుధాలమై తెలంగాణకు మళ్ళీ పురుడుపోద్దాం" అన్న బాణాల శ్రీనివాసరావు వంటి కవుల ఆకాంక్షలతో మనమూ గొంతు పెకలిద్దాం, కలాలకు పనిపెడదాం!

- వి. నాగమణి

ఇందులో ముందుగా -

ఎవరి రక్తంతో తడిసి / ఈ మట్టి ఎరుపెక్కిందో
ఎవరి చెమటతో తడిసి / ఈ మట్టి నల్లబడిందో
ఎవరి కన్నీళ్లతో తడిసి / ఈ మట్టి తెల్లబడ్డదో

వారికే ఈ పుస్తకం అంకితం అనడం ఎంతో ఆర్తిగా, సత్యావేశంగా, బలంగా, కర్తవ్య బోధకంగా వుంది. రాతి గుండెను సైతం కరిగించి, రగిలింప చేసేటటు వంటి పుస్తకం ఈ "తెలంగాణ కవిత - 2007" అనడం కాదు, ఆలోచింపచేస్తున్నాయి. తిరిగి జీవితానికి, పుట్టిన గడ్డకు అంకితం కమ్మంటున్నాయి. ఇందులో మొత్తం 58 కవితలున్నాయి. అన్నీ చాలా బాగున్నాయి.

ఈ సంకలనంలోని 'దోక' అన్నముందుమాటలో గ్రామాలలోనే కమ్మ, వెలమ, బ్రాహ్మణ, ముస్లిం, భూస్వాముల పెత్తనం వల్ల చోటు చేసుకున్న దారుణాలు చాలా



కసిగా, నిర్మొహమాటంగా వివరించారు.

"తూర్పు నుండి వచ్చెరా తుప్పల నక్కా
పడమటి నుండి వచ్చెరా పర్వతాల నక్కా

ఆ నక్క ఈ నక్కా తోడేరా బొక్కా " అన్నప్పుడు సామాజిక కసి, వ్యంగ్యం బయట పడుతున్నాయి. వాడైతేనేం, వీడయితేనేం కలిసి ఈ తెలంగాణాను ఏ విధంగా, ఎంత క్రూరంగా దోచుకు తింటున్నారో తెలియ చేయడం జరిగింది.

మన నేల మనది అయితే మాతృత్వం ఎందుకు ఒకే విధంగా లేదో అరయబోయాడు కవి. సవతి తల్లి ప్రేమను గురించి ప్రశ్నించాడు.

"మన నేల ఒక్కటే మన జాతి ఒక్కటే అయితే
మన బతుకులు ఒక్క తీరుగా ఎందుకు లెవ్వు" అంటూ నిలదీస్తున్నాడు.

"కసాయిని నమ్మిన గొర్రెల్లా ఉద్యమాల్లో ప్రాణాలు కోల్పోయిన వారి రక్తపు చారలు ఎర్రజెండాల్లో ఎప్పుడు రెపరెపలాడుతూనే వుంటాయి" అంటూ ఇడుపు కాగితంలో "ససుమాన స్వామి" గారు వ్యక్తం చేసిన ఆగ్రహపు సెగలు తాకుతున్నాయి.

వలస పోతూ, కౌలుదారులు, భూయజమానుల భూముల్లో పంట పండిన కాలంలో మాట పొత్తు కలిపి పంటను లాక్కోవడం దొరల యొక్క అరాచక బందిపోటత్వం. ఇకనైనా మేలుకోండి ఎవరి బ్రతుకులు వారు, ఎవరికీ లోనవకుండా బ్రతకండి అని "ఇరుగుడు"లో దాసరాజు రామారావు గారు ప్రకటించిన సూత్రాలు పాటించవలసి వుంది.

(మనుషులు) ప్రజలను ఆకలితో మలమల మాడుస్తూ వివిధ రకాల ప్రాజెక్టులను నిర్మిస్తున్నారు.

"మన తెలంగాణాలో పుట్టి పెరిగినట్లు వలస వాదుల వలసాధిపత్యం చెలాయిస్తుంది. మనతో కలిసి మేతమేసింది చాలక వేరైతీరుదాం అంటూ కెలికినట్లుగా ప్రవర్తించడాన్ని తిప్పికొడుతూ ... వేరై తీరురుదాం రా! అనే కవితలో వేణుసంకోజు గారు పిలుపునివ్వడం గర్వించతగ్గదిగా వుంది.

కలుపు మొక్కలు కలిసి పీకేసి, అర్కతి, బర్కతికి పోలిచేసి జల్లి పరిపాలకులు పొలిమేర పారంగా, తెలంగాణ రాష్ట్రాన్ని తీర్చుదిద్దుదాం అంటూ ఆహ్వానం పలుకుతున్నాడు పొన్నాల బాలయ్య. అతనికి యువలోకమంతా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నది.

"తెలంగాణ ట తెలంగాణ"లో "జూకంటి జగన్నాథం" వ్రాసిన కవిత వ్యత్యాసాలను, పక్షపాత వైఖరులను నిట్టనిలువునా నిరసిస్తున్నది.

పసునూరి రవీందర్ గారు వ్రాసిన "జ్ఞాపకాల ఖజానా" కవితంతా అర్థ శతాబ్ద కాలంగా తెలంగాణ ప్రాంతం వాళ్ళు అవకాశాలకు ఎట్లా దూరమైందీ, వనరుల దోపిడీకి ఎంతగా బలియైందీ చిత్రిక పట్టింది.

అమ్మంగి వేణుగోపాల్ "దిక్సూచి" కవిత– తెలంగాణా వాళ్ళు ఏ విధంగా వివక్షల మధ్య జీవితాలను – ఎంత భయంకరంగా– హృదయ విదారకంగా కొనసాగిస్తున్నారో వివరించిన విషాదం. రాబోవు తరాల గురించి ఆరాతీస్తూ వాళ్ళెంత కాలం నవిసిపోవాలో అంచనా వేయజూస్తుంది. ఎన్నెన్ని సుడిగుండాలను ఈదాలోనని ఆక్రందిస్తుంది. ఈ సంకలనంలోని కవితలన్నీ కదిలించేవిగా, మార్పు వైపుకని అదిలించేవిగా ఉన్నాయి. అనంత చైతన్య ప్రసరణకు అవకాశం కలిగిస్తున్నాయి.

**– పి. అనిత**

***(ప్రముఖ తెలంగాణ రచయిత, కవి వేణుసంకోజు గారి సంపాదకత్వంలో వెలువడిన "చలనం" నుండి )***



# తెలంగాణ కవిత - 2008

## ఆంధ్రజ్యోతి

ఒకప్పటి దళిత స్త్రీ వాదాలలాగా ఇప్పుడు తెలంగాణ వాదమే తెలుగు సాహిత్యంలో ప్రధాన స్రవంతి. తెలంగాణ వాదంలోనూ స్త్రీవాద, దళితవాద ప్రత్యేక కోణాలున్నప్పటికీ ఈ సంకలనం తెలంగాణవాదానికి పూర్తిస్థాయి ప్రాతినిధ్యం వహించిందని చెప్పాలి. సంపాదకులు ఏ కవికీ ప్రత్యేక వస్తు నిర్దేశం చేయలేదని ఈ కవితలు చదివిన ఎవరికైనా అర్థమవుతుంది. ఇందులో ప్రతి కవితా భిన్న పార్శ్వాలను స్పృశిస్తూ జాలువారింది. అన్ని కవితల్లోనూ అంతర్వాహినిగా కనిపించే తాత్విక భూమిక మాత్రం తెలంగాణనే.



"ఆకాశం, నక్షత్రాలు పండించినట్టే నేలమీద మేమూ గింజల్ని పండించగలం" (నాళేశ్వరం), "వాళ్ళు చిక్కు చీకట్లల్ల చెమట పారకం పెట్టి వెన్నెల కోసలౌతారు" (వఝల), "దొంగచాటుగ తెచ్చుకున్న చెలమ చనుబాలు చెమ్మగిల్లిన నేల ఆవిర్లు తల్లీ" (కందుకూరి దుర్గాప్రసాద్), "మావ్వ దిగుల్లె దీపం గాదు, ఆకాశం గొంగట్ల ఆగరమైన పొద్దు" (జూపాక సుభద్ర) లాంటి చక్కని కవితా ప్రారంభాలు. మెరిసిపోయే వాక్యాలు ఇందులో ఎన్నో ఉన్నాయి. దేవుడు మళ్లీ మరణించాడు (దెంచనాల), నిశాని (పగడాల), నేలే (వేణు సంకోజు) లాంటి విలక్షణమైన కవితలు అబ్బురం కల్గిస్తాయి. తండ్లాట, మార్వానం, దారంకండె, ఎనగర్ర, శివసత్తి నాట్లు ఏసుదు, తూకం పీకుడు, మనాది పీనుగ, పీతిరిగుడ్డ, పద్ది, అంచులాంటి పదాలను వాడడం వల్ల కవిత్వం మరింత సుసంపన్నం అయింది.

ఉద్యమం ఉవ్వెత్తున లేస్తున్న సందర్భంలో కవి ఏం మాట్లాడినా అందులో ఉద్యమం స్పృహ కనిపించడం ఒక అనివార్యమైన పరిణామం. అయితే ఉద్యమాలతో వాదాలతో కవిత్వానికి ఓ ప్రమాదం కూడా ఉంది. పొంచి చూసే పక్కా వచనం కవుల మీద దురాక్రమణ చేస్తుంది. ఇలాంటి సందర్భాలు ఈ సంకలనంలోనూ అక్కడక్కడా కనబడతాయి. ఈ విషయంలో సంపాదకులు మరింత జాగ్రత్తగా వ్యవహరిస్తే బాగుండేది.

ఏమైనా అరవై ఐదు కవితలు సేకరించి ఎన్నో శ్రమలకోర్చి, సంకలనం చేయడం మామూలు పనికాదు. ఈ రకంగా సుంకర రమేశ్ అభినందనీయుడు.

**– కాంచనపల్లి**

## ఈనాడు

గడీల్లేవు. దోపిడీ ఉంది. దొరల్లేరు. దొరతనముంది. స్వాతంత్ర్యమొచ్చి ఇన్నేళ్లు గడిచినా తెలంగాణ మారలేదు. గుండె గాయం మానలేదు. ఆ బాధ, ఆ ఆక్రోశం ... 'తెలంగాణ కవిత' అయి కణకణమని మండుతోంది. 'వందల వందల సెజ్జులు / బొందలు తవ్వి / పారలతో సిద్ధంగా ఉన్నాయి / నన్ను పూడ్చడానికి' అంటూ ఉదయభాను పోలేపల్లి పేదల బతుకుల్ని అక్షరాల అద్దంలో స్పష్టంగా చూపిస్తారు. 'రావణుడు సీతనెత్తుకుపోయినట్లు / మా నేల తల్లిని యెత్తుకుపోతుంటే / మౌన ప్రేక్షకుడిలా యెలా ఉండిపోగలం' అని నాళేశ్వరం శంకరం నిర్భయంగా నిలదీస్తారు.

'ఏమి లేనోడు పదేండ్లల్ల కోట్లెట్ల సంపాదిస్తాండు / నిలబడి చూచెటోడు గతిలేక లాపత్తా ఎట్లయితాండు / మీరంతా కల్సి / మమ్మల్ని ఎవరికి / ఎంతకమ్మిండ్లో చెప్పుండ్రి / మా నెత్తిల కనబడకుండ ఎంత బాకీ మోపిండ్లో చెప్పుండ్రీ ...' అనడుగుతున్న చంద్రమౌళి ప్రశ్నకి జవాబెవరు చెబుతారు?

– కిషన్

## వార్త

తెలంగాణ కవుల ఆలోచనలు, మనోభావాలు, సంస్పందనలు ఎలా వున్నాయో తెలుసుకోడానికి ఉపయోగపడే పుస్తకం 'తెలంగాణ కవిత 2008'. సుంకర రమేశ్ సంపాదకత్వంలో 'మట్టి ముద్రణలు' వెలువరించిన పుస్తకమిది. అరవై మందికి పైగా కవులు రాసిన కవిత్వం ఇందులో వుంది. తెలంగాణ సమకాలీన జీవితాన్ని భిన్నకోణాల్లో చిత్రించారు కవులు. తెలంగాణ నేల, సంస్కృతి, పోరాటం, ఉద్యమాల సందడితోపాటు అనేకానేక ఉద్వేగాల్ని ఒకచోట కూర్చిన సంకలనమిది, తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడాలన్న ఆకాంక్ష ప్రధానంగా వుంది. తెలంగాణలో వచన కవిత వికాసం తీరుతెన్నుల్ని అంచనా వేయడానికి ఉపకరించే పుస్తకమిది. తెలంగాణ భాషలో, అభివ్యక్తిలో, కవితా శిల్పంలో వైవిధ్యాన్ని పట్టిచూపే కవిత్వాన్ని ఒక చోట చదవడం ఉద్విగ్నమైన అనుభవం.

– ఎస్. మల్లేష్

## సూర్య

తవ్వి పోసుకుంటున్న కొద్దీ తన్నుకొస్తూనే ఉన్న ఊట ఒడువది. నిజమే, ఇది దుఃఖాల్ని దున్ని చాలువోసిన తొక్కుడుబండ దిగులు ప్రకంపనల సంకలనం. ఈ చాల్లెంబడి కదులుతూ దగా పడుతున్న తెలంగాణ గుండె కోతల ఆనవాళ్ళు తెలుస్తాయి. రూపం మారుతున్న దోపిడీ తీరులు తెలుస్తాయి. అణగారిపోతున్న సబ్బండ వర్ణాల బతుకుల మీద కొనసాగుతున్న జులుం తెలుస్తుంది. సామాజిక రాజకీయ వివక్షల జాడలు కనపడతాయి. సుంకర రమేష్ సంపాదకత్వంలో వెలువడిన 'లెంగాణ కవిత 2008' సంపుటిని కేవలం ఉద్వేగాల సంపుటిగానో, ఉపరితల సంస్పదనల సంకలనంగానో భావిస్తే అది పాక్షిక దృష్టి మాత్రమే. తెలంగాణ బతుకులో, బతుకు పోరులో కవిత్వం అంతర్లీనమైన అంశం. పదచిత్రమైన, అభివ్యక్తమైన, వ్యంగ్యమైనా అది అనుభవాల్నించి తన్నుకొచ్చే వ్యక్తీకరణే తప్ప శూన్యంలోంచి సృష్టించినది కాదు. ఏ కవితా పాదాన్ని తడిమినా అది నెత్తుటి చెమ్మలా తగిలి కల్లోల పెడుతోంది. అందుకే సమకాలీన కవిత్వంలో తెలంగాణ కవితకున్న ఆర్ధ్రత, ఆరాటం, భావ సాంద్రత తీవ్రత ఇతర ప్రాంత కవిత్వంలో అరుదు.

మంది, పైన మర్మం తెలిపే 'ఉస్నాదంగడి' కవితని నాంపల్లి సుజాత సబ్బండ వర్ణాల చెమట తడిలోంచి ఆవిష్కరించింది. ఎద్దు మనిషికి సోపతి, ఎద్దు ఎవుసాయానికి ఆపతి సంపతి అంటూ మట్టికీ పసురానికీ ఉన్న అనుబంధాన్ని కళ్ళు చెమర్చేలా చెబుతాడు అన్నవరం దేవేందర్. ఆరు నెలలైనా అంగుళమైనా కదలని న్యాయం కోసం కుట్ర కేసుల కమ్మీల మధ్య ఏకాంత వాసపు పెనుగులాటని 'అమర్' అక్షరీకరించాడు.

రాజ్యం జిత్తుల్ని ఎత్తుల్ని ఎండగడుతూ దాని అణచివేత రూపాల్ని కళ్ళకు కట్టే మునిమడుగుల రాజారావు కవిత 'అసమాంతర పీఠభూమి – అగుపించని అణిచివేత' ఆలోచనకు దారులు తెరుస్తుంది. నాళేశ్వరం శంకరం కవిత 'అస్తిత్వానికి అంత్యక్రియలు' మట్టికాళ్ళ మనుగడకు సెజ్‌లు చేస్తున్న ద్రోహాన్ని వివరించింది. ప్రపంచీకరణ జాలంలో రాజ్యం కుయుక్తులకు కన్నీరు పెడుతున్న తెలంగాణ పల్లెల జ్ఞాపకాలు ఎందరో కవుల్ని, గాయకుల్ని కదిలించి కవితలై పాటలైన వైనాలు తెలంగాణ ప్రాంతంలో ఎక్కువగా కనిపిస్తాయి. ఈ కోవలోదే 'కాంచనపల్లి' సంధించిన కవిత. రాత్రి దండేనికి వేలాడే ఊపిరి తీగకు గుచ్చుకున్న ఊరు జ్ఞాపకాల్ని నిసర్గమైన పల్లె బతుకుల సాక్షిగా (జూలపల్లి) దృష్టికందిస్తాడు. నిరాశామయ స్థితి నుంచి ఆశావహ భవిష్యత్తుని అపురూపంగా కలకంటాడు విద్యాసాగర్.

'నలువుకుంటూ కళ్ళు తెరిచే తరాన్ని ...! (నీటి జాడను వెతుక్కుంటూపోయే / జంతువులను వేసే దౌర్భాగ్యం మనదే' – అంటూ ఇదే కవితలో తెలంగాణ భాషకున్న సౌహార్దతను, వివక్ష కింద పొందుతున్న గాయాల్ని వివరించే కందుకూరి దుర్గా ప్రసాద్ కవిత 'జాడ' అందరూ చదవదగ్గది. వడ్డెబోయిన శ్రీనివాస్ 'మట్టిని ప్రేమించి / మనుషులను ధారబోస్తున్న నేల' అంటాడు తన కవితలో. పోరాట పత్రహరితం తెలంగాణ ఓ చక్కని ప్రయోగం.

పగడాల నాగేందర్ ధర్మాగ్రహ కవిత 'నిశాని'. 'కవిత'ని కృత్రిమ కచ్చడాలనించి రమ్మని పిలుస్తూ 'కవితా ఓ కవితా నాతో కలిసి రా! / నలుగురూ తలవంచి నమస్కరించేలా / నడిబజార్లో జెండాలా ఎగరేస్తాను' అంటాడు. ఇద్దరి నడుమ పొసంగం కుదరని సారాల్ని 'పొంతన' కవితలో ఆర్క్యూబ్ వివరిస్తాడు. శబరీ గోదావరి కలిసే చోట సంజెరంగుల్లో కమ్ముకున్న విషాదపు ఎర్రజీవుల్ని 'మట్టి మరణ వాంగ్మూలంగా' వినిపిస్తాడు అరుణ్ సాగర్. తవ్వి వదిలేసిన పురాస్మృతుల పరిమళాలను దాసరాజు రామారావు పరిచయం చేస్తాడు తన కవితలో.

పోరాటం ఈ నేల ఊపిరి. ఏ రాజకీయ శక్తుల ప్రేరేపణా, ఏ వ్యాపార వర్గాల ప్రయోజనాత్మక పెట్టుబడులూ అక్కర్లేదు. విచ్ఛిన్నమౌతున్న తెలంగాణ బతుకుల అలజడి చాలు ఉప్పెనై తీరం తాకడానికి. మావ్వ దిగుల్లె దీపం గాదు / ఆకాశం గొంగట్ల ఆగమైన పొద్దు / నేలమ్మ కొంగున అంగిట బట్టిన ఆకలి / పగిలిన దప్పు మీది దరువు / భూమికి కాత, పూత, పంట ఫలం నేర్పి - అంటూ జూపాక సుభద్ర తల్లిని తల్లిలాంటి నేల స్థితిని తొక్కుడుబండ తీరొక్క వెతల్ని వ్యక్తీకరించిన తీరు కదిలిస్తుంది.

'కాలాన్ని గొంతులోకి విషాన్ని మింగినట్టు మింగి / కరువు నేలపై తచ్చాడుతున్న వాక్యం / భాషలో కన్నీళ్ళను వెతుక్కుంటున్న సందర్భం మాది' అంటూ వేముగంటి మురళీకృష్ణ నేల కోసం బలమైన పోటెత్తుకుంటాడు. 'కలల కన్నీళ్ళుగా మారిన చోట / ప్రతి ఉలికి పాటూ ఉద్యమమే' అంటూ విత్తనం తండ్లాటను పసునూరి రవీందర్ వినిపిస్తాడు. కలల్ని కూల్చిన వెర్రి నవ్వుల కపట రాజకీయాలను నందిని సిధారెడ్డి ఎండగడతాడు.

హాఁరాజ్ బ్రతుకుల గతుకుల్ని హనీఫ్ తన కవితలో చక్కగా చూపిస్తాడు. తెలంగాణ జన జీవన సంఘర్షణల్ని, సమకాలీన ఉద్యమాల నేపథ్యాల్ని భిన్న కోణం లోంచి పరిచయం చేసే అపురూపమైన సంకలనం ఇది. దాదాపు ప్రతి కవితకీ అర్థవంతమైన చిత్రాల్ని చేర్చి చక్కగా అందించారు ప్రచురణకర్తలు - మట్టిముద్రణలు.

**- వర్ఘుల శివకుమార్**



# హైదరాబాద్ మిర్రర్

అన్నీ వున్నా అల్లుని నోట్లె శని ఉన్నదన్నట్టుగుంది తెలంగాణ పరిస్థితి. హైదరాబాద్ అసొంటి మహా నగరమున్నా, జీవనదులున్నా, అటవీ సంపదున్నా తెలంగాణ ఇంకొకరి పెత్తనంలనే ఉంది. తెలంగాణ అస్తిత్వమే ప్రశ్నార్థకమైతంది. కానీ గివ్వన్నిట్లీ జబర్దస్తీగ ఏకి పారేత్తాంద్రు తెలంగాణ కవులు. కైత 2008 నిండి తెలంగాణ గురించి రాసిన కైతలే ఉన్నయి. అభివృద్ధి పేరతోని తెలంగాణ భూముల్ని లాగేసుకునుడు, ఉన్న ఆసర లేకుండ జేసుడు, భూమి సమస్య, అస్తిత్వ సమస్య, భాషా సమస్యల అసొంటియన్నా గీ కవితల నిండున్నయి. ఏ మాత్రం సంకోచం లేకుండా చేసుడు, అన్ని విషయాలను ఖుల్లం ఖుల్లంగ చెపుతున్నరు. గొంతులు తడిపి ప్రాణాలు నిలిపిన భూమిని గుంజుకొని ప్రాణాలు తీస్తున్నరని కవి సూటిగానే చెప్పుతుండు. మట్టి తల్లి మీద పెంచుకున్న ప్రేమను కవిత్వం రాస్తున్నరు. కవి వ్యథ చెందుతున్నడు. వలస పాలకుల ఆటలు సాగయంటున్నడు. విదేశీయులు మా దేశం వచ్చి వనరులను మాత్రమే కొల్లగొడితే వలస పాలకులు మాత్రం భూములను, సర్వస్వాన్ని కొల్లగొడుతున్నారని అంటున్నాడో కవి. గీ పుస్తకం నిండ తెలంగాణ భాష, యాస, నుడికారం జబర్దస్తీగున్నయి. తెలంగాణ ఊళ్ళళ్ళ తిరుగుతున్నట్టే ఉంది. తెలంగాణ కష్టాలు ఎరుకైనట్టే ఉంది. సుక్కరారం గోలె ఎగిలివారంగ సురువైతది ఉస్మానాబాదంగడి అంటుందో కవయిత్రి. హైదరాబాద్‌కు జరిగిన మోసాలను అక్షరీకరించిండో కవి. గిట్ల తెలంగాణ గురించి అరొక్క సంగతి గీకైతల్నిండ ఉన్నయి. గీ వయిని అందరు చదవాలె. కొనుక్కొని చదువాలె. వెంకటేశ్ గీ కైతలకు అవ్వల్దర్జ సమీక్ష రాసిండు.

కవుల బొటన వేలిముద్రల చిరునామా - "తెలంగాణ కవిత - 2008" "దగాపడ్డ తెలంగాణలో దోపిడి కొత్త కొత్త రూపాల్లో కొనసాగుతూనే ఉన్నది. చారెడు నేల కోసం నిండు ప్రాణాలు బలైపోతూనే ఉన్నాయి. అభివృద్ధి పేరుతో భూముల్ని లాగేసుకుంటున్నారు. ఉన్న ఆసరా కూడా పోయే సరికి ఆత్మహత్యలే శరణ్యమవుతున్నాయి. నేత కార్మికులు పిట్టల్లా రాలిపోతూనే ఉన్నారు. అప్పుల బాధకు తాళలేక ఆత్మహత్యల్ని అనివార్యం చేసుకుంటున్నారు. సిరిసిల్లా

ఆత్మహత్యల ఊరుగా ప్రసిద్ధి కెక్కింది. నల్లగొండ ఫ్లోరోసిస్‌తో వంకర్లు పోతూనే ఉంది.

సుంకర రమేశ్ క్రమం తప్పకుండా ప్రతి సంవత్సరం తెలంగాణ కవితను తెస్తున్నాడు. వివిధ పత్రికలలో వచ్చిన కవితలను ఒక చోట చేర్చి మనకందిస్తున్నాడు. తెలంగాణ కవిత – *2008*లో మొత్తం *63* కవితలు ఉన్నాయి. ఈ కవితా సంపుటిలో 'భూమి' సమస్యను ప్రధానంగా చేసుకున్న కవితలు ఎక్కువగా కనిపిస్తాయి.

కాంచనపల్లి రాజేందర్ రాజు 'అయ్యో ... భస్మాసురా!" అనే కవిత పంక్తులు చూడండి.

"గొంతులు తడిపి – ప్రాణాలు నిలిపిన
భూమిలాక్కొని
గొంతులు కోసం – ప్రాణాలు తీసి
సమాదిల కోసం ఊరి కావల ఎడారిలో
పునాదులు వేస్తుంది రాజ్యం"

తెలంగాణ భూమి క్రమంగా అన్యాక్రాంతమై పోతుంది. మా మట్టితల్లిపై పెంచుకున్న మమకారం దూరమైపోతుంది. మొత్తానికి మాకు మేము పరాయీకరణ చెందుతున్నాము. ఇన్నాళ్ళు మాకు ఆకలి దప్పులు తీర్చిన మా భూమిని లాక్కొని, ఎదురిస్తే మా ప్రాణాలు నిర్దాక్షిణ్యంగా తీసి ఊరికావల సమాధుల ఎడారిలో మా కోసం పునాదులు రాజ్యం తవ్వుతున్నది అని కవి వ్యధ చెందుతున్నాడు.

ముని మడుగుల రాజారావు "అసమాంతర పీఠభూమి – అగుపించని అణచివేత" అను కవితలో ...

"నేను పల్లెనవుతే
వాడు పట్టణానికి పరుగులు తీసి
మహా నగరమై నగారా మోగించాడు
నేను వలసనై వాడి వద్దకే వెలితే
వాడు మళ్ళీ నదీ తీరమై
అడవే నయమన్నాడు"

పై పంక్తులను జాగ్రత్తగా గమనిస్తే సీమాంధ్ర వలసవాదుల కుట్ర బహిర్గతం అవుతుంది. నేను పల్లె సర్వస్వం అనుకొని అక్కడే జీవిస్తే వాళ్ళు పట్టణాలకి పరుగులు తీసి "మహానగరమై"పోయారు. మళ్ళీ నేను వలసనై వాడి దగ్గరకే వెళితే మళ్ళీ పల్లెనయం అని అంటున్నాడు. ఈ విధంగా తెలంగాణలో నగరాలని – పల్లెలను వలసవాదులు తెలంగాణ ప్రాంత ప్రజలను అమాయకులను చేసి సర్వస్వం దోచుకుంటున్నారు.

ఈ కవిత సంపుటిలో నాళేశ్వరం శంకరం" అస్తిత్వానికి అంత్య క్రియలు" అనే మంచి కవిత రాసిండు.

"మా నేల మాది అదే మా అన్నం ముద్ద
అమ్మా అమ్మమ్మా నానమ్మా అనే కాదు
మా తనువంతా ఆమె ప్రతిరూపమే!
లక్షల యేళ్ళ బట్టి గాలిలో ఉయ్యాల లూగే పొలాల సోయగాలన్నీ
మా ముత్తాతల తండ్రుల పనితనాల ప్రతిబింబాలే"

మా జీవితం అంతా ఈ మట్టి తల్లిపై ఆధారపడి ఉంది. ఇది కేవలం నేల కాదు మా అన్నం ముద్ద. ఈ నేల మా తాత ముత్తాతల పనితనానికి ప్రతిబింబాలే అంటూ తెలంగాణ నేల గొప్పతనాన్ని దృశ్యీకరిస్తున్నాయి.

"ఆ వచ్చి వెళ్ళిన పోర్చుగీసువాడు ఫ్రెంచివాడు డచ్చీవాడే నయం
వాళ్ళు మన వనరుల్ని కొల్లగొట్టుకుపోయారే గాని
మన భూముల్ని కొల్లగొట్టుకు పోలేదు గదా!"

బ్రిటీషు కాలం నాటి పోర్చుగీసు, ఫ్రెంచివాడు, డచ్చివాడు మన దేశానికి వచ్చి "కేవలం" వనరులను మాత్రమే కొల్లగొట్టాడు. స్వదేశీయులైన సీమాంధ్ర వలసవాదులు మా భూముల్ని కొల్లగొట్టుకుపోతున్నాడు. మాకింత అన్నం ముద్ద లేకుండా జేస్తున్నారు అని అంటున్నాడు.

"అంతా ఒల్లెక్కల" అను కవితలో రామ చంద్రమౌళి కవిత పంక్తులు ...

"భూములన్నింటిని అడ్డికి పావు శేరమ్మి
గాలిక్కొట్కపోయే రోడ్లేసి, కాలువలు కట్టి
మంది కొంపలు ముంచి కోట్లక్కోట్లు ఆనబడ్తిరి ..."

తెలంగాణలోని భూములను తక్కువ ధరలకు కొనుక్కొని కేవలం ఒక గాలివాన వస్తే కొట్టుకపోయే రోడ్లు, కాలువలు కడ్తిరి. మంది కొంపలు ముంచి మీరు కోట్లు కోట్లు తినబడ్తిరి అని దోపిడీ దారుల నగ్న స్వరూపాన్ని బట్టబయలు చేస్తున్నాడు కవి

నాంపల్లి సుజాత గారు "ఉన్నాదంగడి" అను కవితలో తెలంగాణ మాండలికాన్ని సమర్థవంతంగా ఉపయోగించుకున్నారు.

"సుక్క రారం గోలే ఏగిలి వారంగ
సుర్వైతది ఉన్నాదంగడి
సుట్టు ముట్టు ఇర్వైయార్ల పెట్టు
రాకడ పోకడ కిరాం లేదు"

అంగడి వాతావరణం ప్రస్తుతం తెలంగాణలో కనుమరుగైంది. ఎక్కడ చూసిన రిలయన్స్, మొదలగు షాపింగ్ మాల్స్ కూరగాయల నుండి సెల్‌ఫోన్‌ల దాకా ఎ టు జడ్ వస్తువులు అమ్ముతున్నారు.

"పైస పుట్టేది మాయ మయ్యేది
మంది గూడేది మర్మం తెలిసేది ఇక్కన్నే"



అంగట్లో వారం మొత్తం కష్టపడిన వాడు వస్తువులు కొనుక్కొనడానికి, అమ్మడానికి వస్తారు. అందుకే పైస పుట్టేది మాయం అయ్యేది అంగట్లోనే. పదిమంది గూడ వాళ్ళ కష్టసుఖాలు చెప్పుకునే మంచి వేదిక అంగడి.

'ఒక పాగల్ షాయర్' అను కవితలో "రాజా హైద్రాబాదీ" హైదరాబాద్ నగర సౌందర్యం గురించి అద్భుతమైన కవిత్వం రాసిండు.

"మిత్రుడా!
నా హైదరాబాద్
ఒక "చిత్రలేఖ"
చిన్న మోసాలు జరిగినా
ఎన్నెన్ని మార్పులు వచ్చినా
నా కళ్లల్లోని దృశ్యం చెరగదులే"

కవి హైదరాబాదు నగరంలోని చార్మినార్, గోలకొండ, పత్తర్‌గట్టి, కృష్ణా టాకీస్, లష్కర్, అల్వాలు మొదలగు అందమైన ప్రదేశాలను చూపిస్తున్నాడు. ఎన్ని మోసాలు జరిగినా, నగరంలో ఎన్ని మార్పులు వచ్చిన గతంలోని హైదరాబాద్ "చిత్రలేఖ"లా ఎల్లప్పుడు నా మనసులో ఉంటుంది అంటున్నాడు.

వంశీకృష్ణ కవిత "కొంతమంది ప్రజలు కొన్ని ప్రతిమలు, ఒక ఆనకట్ట-కథ" అను కవితలో ...

"రాజశేఖర్ ... రాజశేఖర్
యిదేమి రాత
ప్రత్యేక తెలంగాణ కావాలంటే
50 కోట్ల ప్రజల అనుమతి కావాలన్నావు
పోలవరానికి ఎనిమిదికోట్ల
ప్రజల అనుమతి అవసరంలేదా...?"

కీ.శే. వై.యస్. రాజశేఖర్ రెడ్డిగారు బ్రతికి వున్నప్పుడు తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంలో అభివృద్ధి జపం చేశారు. తెలంగాణ అభివృద్ధి చెందింది. ఇప్పుడు తెలంగాణ ఎవ్వరూ కోరుకోవట్లేదు అంటూ ప్రాజెక్టులు గారడీలు చేశారు.

"జాడ" అను కవితలో కందుకూరి దుర్గా ప్రసాద్ కవిత పంక్తులు

"తెలుగు మాట్లాడే వాళ్ళది
అయితే గియితే
తెలగునాడు కావాలి
ఆంధ్రప్రదేశ్ యని ...
జాతి వాచకమెట్లయినదే ...!

తెలంగాణలో తెలుగు మాట్లాడే వారు తెలుగువారు కారు. తెలుగునాడు అనే ప్రదేశానికి చెందినవారు. అంతేగాని భాషా ప్రయుక్త రాష్ట్రాల ఆధారంగా ఏర్పడ్డ రాష్ట్రాలకు "ఆంధ్రప్రదేశ్" అనేది ఎంత వరకు సమంజసం అని కవి ప్రశ్నిస్తున్నారు.

కాసుల ప్రతాపరెడ్డి ఒకానొక అసంపూర్ణ వాక్యం కూర్పి, గురించి" అను కవితలో చీమల దండు వలె అన్యాయంపై తిరగబడమని అంటున్నాడు.

"ఇప్పుడు
చారిత్రక ద్రోహాలకు
గుండె పగిలిన చీమల దండుకు సైరనూదాలి"

అంటూ చారిత్రక ద్రోహులకు సరైన గుణపాఠం చెప్పాలని సూచిస్తున్నారు.

మొత్తానికి ఈ కవితా సంపుటిలో పాలు – నీల్లు కలిసిన కవితలా ఉంది. సంపాదకుడు సుంకరరమేశ్ కవితల ఎంపికల తగిన జాగ్రత్త పాటిస్తే బాగుండేది. ప్రముఖ కవులు రాసిన పేలవమైన కవితలు, కొత్తవారు రాసిన మంచి కవిత్వం యిందులో ఉన్నది. ఇంత మంచి ప్రయత్నం చేస్తున్న సుంకర రమేశ్‌కు గౌరవాభివందనాలు.

– ఐ. వెంకటేష్